శ్రీః

# చంద్రాలోకము

(శతాలంకార వ్యాఖ్యానము)



: వ్యాఖ్యాత :

'భాషాప్రవీణ'

డా|| బులుసు వెంకటసత్యనారాయణమూర్తి

ఎం. ఏ; ఎంఫిల్; పి. హెచ్ డి.

రో

రోహిణీ పబ్లికేషన్స్

మెయిన్ రోడ్ రాజమండ్రి-533101

చంద్రాలోకము :

డా॥ బులుసు వెంకటసత్యనారాయణమూర్తి
ఎం. ఏ; ఎంఫిల్; పి. హెచ్. డి

వ్యాఖ్యానం హక్కులు
ప్రకాశకులవి.

ఫిబ్రవరి 95



మూల్యం : రు-15/-

కవర్ డిజైన్ : 'బాలి'

ముద్రణ :
రామకృష్ణా ప్రింటర్స్,
రాజమండ్రి 1

ప్రకాశకులు : ఫోన్ : 73444
రోహిణి పబ్లికేషన్స్,
మెయిన్‌రోడ్, రాజమండ్రి 1

# ముन్నుడి

శ్రీరోహిణి పబ్లికేషన్స్‌వారు కొన్ని అపురూప గ్రంథములను పునర్ముద్రణముగావింప నిశ్చయించుకొనిరి. కేవలము ధనాపేక్షతోను, లాభాపేక్షతోను నేడు పుస్తకవ్యాపారము సాగుచుండ సాహిత్యసేవనమే లక్ష్యముగా వీరు కొన్ని గ్రంథములను ముద్రించిరి. ఇపుడు ఆంధ్రిచంద్రాలోకమును బాల బాలికలకు సులభముగా అర్థమగునట్లును సంక్షిప్త వివరణముతో ముద్రింప తలంపు కలిగినది. వావిళ్ళవారి గ్రంథములు వెలువడినంత కాలము సాహిత్య విద్యార్థులకు పుస్తకములు లేవనుచింత యుండెడిది కాదు. ఆంధ్రులదురదృష్టము వారి ముద్రణ మందగించినది. కావున నేడు మార్కెట్టులో చంద్రాలోకము పుస్తకములు లభింపకపోవుట సాహిత్యాసక్తి కల వారలకెల్లరకు విచారము నే కలిగించుచున్నది.

రోహిణి పబ్లికేషన్సు వారు ఈ విషయమును నాతో ప్రస్తావించిరి. ఎందరో మహానుభావుల వ్యాఖ్యానములతో చంద్రాలోకము ఇతః పూర్వమే ముద్రింపబడినది కదా ! మరల నిదేల ? యంటిని గ్రంథరచనమునందును, పఠన, పాఠనముల యందును మీకుగల అనుభవముతో విద్యార్థులకు అనుకూలమగురీతిని, సులభముగా అర్థమగురీతిని సంక్షిప్త వివరణము నొకటి వ్రాసి యిమ్మని వారు కోరియుండిరి. ఏగతి రచియించినను పూర్వకృతుల ముందు ఇది అల్పమే

యగును. తెలిసియు రోహిణివారి సహృదయత నాచే ఈపని చేయుదుననిపించినది.

ఆంధ్ర చంద్రాలోకము అడిదము సూరకవిచే రచింపబడినది. సూరకవి 18వ శతాబ్ది చివరిభాగమునకు చెందినవాడు ఆంధ్రనామశేషము, కవిజనరంజనము, రామలింగేశ శతకము సూరకవి ఇతర కృతులు. సంస్కృతములో నున్న చంద్రాలోకము బాల బాలికలకు చక్కగా నర్థమగునట్లు తెనిగింపవలెనని సూరకవి ప్రయత్నించి యుండును. కాని సంస్కృతము నపేక్షింపక ఆంధ్ర చంద్రాలోకము అర్థముకాదను విషయము వాదరహితము విద్యార్థులకు సులభముగా అర్థమగుట లక్ష్యముగా ఈ వివరణము ప్రారంభింపబడినది.

సంస్కృత శ్లోకము కంఠస్థము చేయుటకు సులభముగ నుండును. కావున ఆ శ్లోకమునుగూడ యిందు చేర్చిన విద్యార్థులకు మరింత సౌకర్యముగ నుండునని శ్లోకములు ముందు చేర్చబడినవి. వివాదాంశముల జోలికిపోక విద్యార్థులఅవసరమే ప్రధానాంశముగ స్వీకరింపబడినది. ఇందుకు పరిశీలించిన గ్రంథము లనేకములైనను ముఖ్యముగా అక్కిరాజు ఉమాకాంత విద్యాశేఖరుల వారి వ్యాఖ్యానమును, మహామహో

పాధ్యాయ పరవస్తు వేంకటరంగాచార్యులవారి పద్యములును నాకు యెంతో ఉపకరించినవి.

అలంకారశాస్త్ర ప్రవేశము, పరిచయము విద్యార్థులకు సులభముగా కావలయుననునదే ప్రధానము కావున ఈ వివరణమున దురవగాహములైన అంశము లేవియున్నను అవి నా దోషములనియే మనవి. వానిని తెలిపి మలి ముద్రణమున సవరింప చేయుట విజ్ఞులుబాధ్యతగా చేకొన ప్రార్థన. సహృదయులకు సదాకృతజ్ఞుడను. ఈపని మీరే చేయవలయునన్న శ్రీరోహిణి పబ్లికేషన్సు వారికి కృతజ్ఞతలు. వారి సాహితీవరివస్య నిర్విఘ్నముగా కొనసాగవలెనని శ్రీనివాసుని ప్రార్థింతును. నేను పరిశీలించిన గ్రంథకర్తలకు, వ్యాఖ్యాతలకు మనసా అభివందనములు. ఆంధ్రి పాఠకుల ఆదరాభిమానముల నాశించుటకన్న ఈ గ్రంథవివరణము ద్వారా నేను వేరుగా ఆశించునదేమియు లేదు.

వ్యాఖ్యాత.

# విషయానుక్రమణిక

శ్రీః

# చంద్రాలోకము

శ్రీ రామచంద్రపుర కే
ళీ రస రసికాంతరంగ లేఖర్షభ కో
టీర మణిఘటిత పద కా
ళీ రమణీలోల రామలింగ మహేశా. 1

వ. అవధరింపుము.

గీ. బాలురకునైనఁ దెలియఁగాఁ గాళిదాసు
మును రచించెఁ జంద్రాలోకమును, త్రిలింగ
భాషఁ జేసితి నీ కృప భవ్యముగను
దీనిఁ గరుణించి చేకొమ్ము దేవ దేవ. 2

క. లలి నొండొరుల తపంబుల
ఫలంబులై యమరియుండి ప్రాణుల కెల్లం
దలిదండ్రు లగుచుఁ దగు తొలి
యల దంపతుల నుతియింతు ననయము భక్తిన్. 3

క. అమరీ కబరీ భార
భ్రమరీ ముఖరీ కృతంబు పరమోజ్జ్వలమౌ
హిమవత్తనయా శుభ పద
కమలము దూరీకరించఘంబులు సతమున్. 4

క. బాలురకు నలంకృతులన్
సౌలభ్యమునం బ్రవేశ సంసిద్ధిం దగున్
మూలమగు లక్ష్య లక్షణ
మాలా సంగ్రహ మనుక్రమంబునం జేతున్. 5

## 1. ఉపమాలంకారము

1. ఉపమా యత్ర సాదృశ్య లక్ష్మీరుల్లసతి ద్వయోః ।
హంసీవ కృష్ణ! తే కీర్తిః స్వర్గంగా మవగాహతే॥

గీ. వర్ణ్య ముపమాన ముపమానవాచకము స
మాన ధర్మము సంఘటింప నగు నుపమ
హంసి చందాన నీకీర్తి యబ్జనాభ !
యభ్రగంగావగాహనం బాచరించు. 6

అర్థాలంకారములలో ఉపమాలంకారము చాల ప్రచురమైనది.

ఉపమానమునకు, ఉపమేయమునకు ఎచ్చట సామ్యము (పోలిక) చక్కగా చెప్పబడునో అది ఉపమాలంకారము.

'ఓ కృష్ణుడా ! నీ కీర్తి హంసివలె ఆకాశగంగయందు మునుకలిడుచున్నది.'

ఇందు కీర్తి హంసితో పోల్చబడినది. కీర్తి ఉపమేయము, హంసి ఉపమానము, అభ్రగంగావగాహనము సమానధర్మము, చందాన ఉపమా వాచకము.

ఉపమేయము (వర్ణింపదలచిన వస్తువు), ఉపమానము (సదృశ
, సమాన ధర్మము, ఉపమా వాచకము నాలుగు అంగములును
ంచే ఇది పూర్ణోపమ.

## లుప్తోపమ

వర్ణ్యోపమాన ధర్మాణా ముపమా వాచకస్య చ ।
ఏక ద్వి త్ర్యనుపాదానా ద్భిన్నా లుప్తోపమాష్టధా॥

వర్ణ్య ముపమాన మౌపమ్యవాచకము స
మాన ధర్మంబు ననువానిలో నొకండు
రెండు మూఁడు వచింపక యుండ లుప్త
యుపమ యెనిమిది విధముల నొప్పగునది. 7

ఉపమేయము, ఉపమానము, సమాన ధర్మము, ఉపమావాచకము
ఉపమాలంకార అంగములలో ఒకటిగాని, రెండుగాని, మూడు
లోపించుట వలన లుప్తోపమాలంకారము ఎనిమిది భేదము లేర్పడు
ది.

అవి : 1. వాచకలుప్త. 2. ధర్మలుప్త, 3. ఉపమానలుప్త,
ర్మవాచకలుప్త, 5. వాచకోపమేయలుప్త, 6. వాచకోపమానలుప్త,
ర్మోపమానలుప్త, 8. ధర్మోపమాన వాచకలుప్త.

తటిద్గౌరీన్దు తుల్యాస్యా కర్పూరన్తీ దృశోర్మమ ।
కాన్త్యా స్మరవధూయన్తీ దృష్టా తన్వీ రహో మయా॥
యత్తయా మేళనం తత్ర లాభో మే యచ్చ తద్రతేః।
తదేత త్కాకతాళీయ మవితర్కిత సమ్భవమ్॥

గీ. చంచలా గౌరి, శశిధర సన్నిభాస్య
చూడఁ గర్పూర దాకృతి, శోభస్మర వ
ధూ యదాత్మిక, వాచక, తుల్యధర్మ
తద్ద్వితీయ వర్ణ్యలుప్త లైదనరు వరుస. 8

గీ. కాకతాళీయ మయ్యె నకాంత మేల
సమును రతియు నతరోక్త్యుపనతి ననంగఁ
బొల్చు నుపమానవాచకంబు లుపమాన
మును వికల్పంబునన్ ధర్మమును విడుచుట. 9

1. చంచలా గౌరి, కాంత చంచల (మెరుపుతీగ) వలె గౌర (పచ్చని) వర్ణము గలది. ఇట వలె ఉపమా వాచకము లోపించినది కావున వాచక లుప్త.

2. శశిధరసమానమైన చంద్రునితో సమానమైన ముఖము కలది అనచో సమాన ధర్మము లోపించుటచే ధర్మలుప్త.

3. చూడగా కాంత కర్పూరాకృతి యనుచో కాంత కర్పూరమువలె చల్ల దనమును, ఆహ్లాదమును కలిగించుచున్నది అని అర్థము. ఇట సమానధర్మము, ఉపమా వాచకము లోపించినది. కావున ఇది ధర్మవాచక లుప్త.

4. 'శోభస్మర వధూ యదాత్మిక' యనుచో మన్మధుని భార్యయైన రతీ దేవివలె శోభ గావించుకొనునదని యర్థము. ఇందు సాధారణ ధర్మ మగు శోభ, ఉపమానమగు స్మర వధువు చెప్పబడినవి. వాచకము, ఉపమేయము లుప్తమైనవి. కావున వాచకోపమేయ లుప్త.

మొదటి పద్యమున నాలుగు భేదములు తెలుపబడినవి. ఉపమాన లోపముకల లుప్తోపమ భేదములు నాలుగును రెండవ పద్యమున తెలుపబడుచున్నవి.

5. 'కాకతాళీయమయ్యే నతర్కోపనతి' యనుచో కాకతాళ + ఈయ — కాక తాళమువంటి అను అర్థమున ఈయ ఉపమావాచకము. అకాంత తోడి రతి ఉపమేయ స్థానము నందుచున్నది. అతర్కోపనతి – అనుకోకుండా సంభవించుట సమాన ధర్మము, ఇట ఉపమానము కాకి తాటిపండు ననుభవించుట. దానిని చెప్పు శబ్దము చెప్పబడలేదు కావున ఇది ఉపమాన లుప్త.

6. కాకి రావడము, తాటిపండు పడటము కాకతాళము. అక్కాంత మేలనము ఉపమేయము, అతర్కోపనతి సమాన ధర్మము. ఉపమానము, వాచకము లుప్తము. కావున ఉపమాన వాచక లుప్త.

7. 'అతర్కోపనతి' సమాన ధర్మముగ పైన చెప్పబడినది. అట్లుకాక 'అలా జరిగింది నీకేం చెప్పను' అనుచో సమానధర్మము లోపించును. 'ఇదంతా కాకతాళీయంలా జరిగింది నీకేమని చెప్పను' అనుచో సమాన ధర్మము, ఉపమానము లుప్తము. కావున ధర్మోపమాన లుప్త.

8. 'ఇదంతా కాకతాళీయంలా జరిగింది నీకు ఏం చెప్పను' కాకతాళము అనుచోట సమాసత్వముచేత వాచకము లోపించినది. సమాన ధర్మము, ఉపమానము లోపము పైన తెలిసికొంటిమి. కావున ఇది ధర్మోపమాన వాచక లుప్త.

## 2. అనన్వయాలంకారము

5. ఉపమానోపమేయత్వం యదేకస్యైవ వస్తునః ।
ఇన్దురిన్దురివ శ్రీమానిత్యాదౌ తదనన్వయః॥

క. జగతి నొక వస్తువునకే
తగ నుపమానోపమేయత ఘటించుట చె
న్నగునేని నది యనన్వయ
మగు శశి శశి భంగి కాంత్యుదగ్రుడను క్రియన్. 10

ఉపమానము, ఉపమేయము ఒకటేవస్తువగుచో అది అనన్వయాలంకారము.

చంద్రుడు చంద్రునివలె కాంతి మంతుడు. ఇచట ఉపమానోపమేయములు రెండును చంద్రుడే. వలె వాచకము, కాంతిమంతత్వము సమాన ధర్మము. ఉపమేయమైన చంద్రుడే ఉపమానముగా కూడ వర్ణింపబడుటచే అనన్వయాలంకారము. దీనివలన చంద్రునికి చంద్రుడే సాటి వేరొకరు లేరు అని తెలియుచున్నది.

## 3. ఉపమేయోపమాలంకారము

6. పర్యాయేణ ద్వయోస్తచ్చే దుపమేయోపమా మతా ।
ధర్మోఽర్థ ఇవపూర్ణశ్రీ రర్థో ధర్మ ఇవత్వయి॥

క. మునుపటివలెఁ బర్యాయం
బున నుపమానోపమేయమున నది గల్పిం
చిన నుపమేయోపమ యనఁ
దనరారుచు నుండుఁ గృతుల దర్పకమథనా. 11

గీ. ధర్మ మర్థము భంగి నర్థంబు ధర్మ
మట్లు నీయందు లక్ష్మీసమన్వితంబు
లతను డిందుండుంబలె నిందుఁ డతనుఁడుంబలె
విరహపీడన దక్షు లన్కరణి శర్వ. 12

ఉపమానము ఉపమేయము ఈ రెండు వస్తువులను మార్చి ఉపమానమును ఉపమేయముగాను, ఉపమేయమును ఉపమానముగాను పేర్కొనిన అది ఉపమేయోపమాలంకారము. ఇచట రెండు వస్తువులు మాత్రమే ఉండును. మూడవ వస్తువునకు అవకాశము లేదు.

'అర్థము ధర్మమువలెను, ధర్మము అర్థమువలెను నీయందు లక్ష్మీసమన్వితము.' మొదటి భాగమున అర్థము ఉపమేయము, ధర్మము ఉపమానము, రెండవ భాగమున అర్థము ఉపమానము, ధర్మము ఉపమేయము. ధర్మము అర్థమును, అర్థము ధర్మమును పోలుచున్నది. వీనికి సరిపోలిన మూడవ వస్తువు లేదు మన్మధుడు చంద్రునివలెను, చంద్రుడు మన్మధుని వలెను విరహులను పీడించుటయందు దక్షులు. ఇదియును పైవలెనే. 'వలె' వాచకము. విరహపీడనదక్షత సమాన ధర్మము.

## 4. ప్రతీపాలంకారము

7. ప్రతీప ముపమానస్యోపమేయత్వ ప్రకల్పనమ్ ।
త్వల్లోచన సమం పద్మం త్వద్వక్త్ర సదృశో విధుః॥

గీ. అరుదను ప్రతీప ముపమాన మైనయట్టి
వస్తు వుపమేయ మగుచును వరలెనేని
నీ విలోచన సదృశముల్ నీరజములు
నీముఖ సముండు పరిపూర్ణ సోముఁడనగ. 13

ప్రతీపాలంకారమును ఐదు విధములుగా చెప్పవచ్చును. ఉపమానమును ఉపమేయముగా చెప్పిన యెడల అది ప్రతీపాలంకారము.

'పద్మములు నీ కన్నులతో సమానములు'

ఇచట వర్ణనీయములు కన్నులు. కాని పద్మములను వర్ణనీయముఁగా చేసి కన్నులను ఉపమానముగా చెప్పుట చేత ఇది ప్రతీపము. ఉపమాలంకారమును ముందు వెనుకలుగా మార్చిన అది ప్రతీపాలంకార మగునని చెప్పవచ్చును.

అట్లే రెండవ ఉదాహరణము "పూర్ణచంద్రుడు నీ ముఖ సముడు'

8. అన్యోపమేయలాభేన వర్ణ్యస్యానాదరశ్చ తత్ ।
అలం గర్వేణ తే వక్త్ర! కాన్త్యా చన్ద్రో భవాదృశః ॥

గీ, పరగ నన్యోపమేయ లాభంబుచే న
నాదరము వర్ణ్యమున కిడ నదియ యగును
గర్వ మొందగ నేల మొగంబ నీకుఁ
గాంతిని భవాదృశుఁడు తారకావిభుండు. 14

అవర్ణ్యమైన ఉపమానముఁను ఉపమేయముగా చేకొని వర్ణనీయ వస్తువును తిరస్కరించుచు చెప్పిన యెడల అదియును ప్రతీపాలంకారమే అగును. "ఓ ముఖమా ! కాంతిని నిన్ను పోలిన వాడు చంద్రుడు కలడు. ఏల గర్వపడెదవు ?" ఇందు వర్ణనీయ వస్తువు ముఖము. చంద్రుడు అప్రికృత మయిన ఉపమేయము. కాంతి సమాన ధర్మము. ముఖమునకే గాక చంద్రునకును కాంతి కలద నుటచే వర్ణనీయ వస్తువగు ముఖమునకు అనాదరము కల్పింపబడినది.

9. వర్ణ్యోపమేయలాభేన తథాన్యస్యాప్యనాదరః ।
కః క్రౌర్యదర్పస్తే మృత్యో! త్వత్తుల్యాస్సన్తిహి
ప్రియాః॥

గీ. ఒరుని ననాదరంబు వర్ణ్యోపమేయ
లాభమునఁ గల్గ నదియుఁ జెలంగు; మిత్తి!
క్రౌర్యదర్పంబు నీకేల? కలరు చాలఁ
ద్వత్సమము లైనయట్టి కాంతాజనములు. 15

వర్ణనీయమైన ఉపమేయము లభించుటచేత అవర్ణ్యమైన ఉపమానమునకు అనాదరము కలిగించిన అదియును ప్రతీపాలంకారము.

"ఓ మృత్యువా! నీకు సమానలైన కాంతాజనము ఉన్నారు. నీకి క్రౌర్య దర్పము లేలః" ఇందు వర్ణ్యము కాంతాజనము. అవర్ణ్యము మృత్యువు. క్రౌర్యమును, దర్పమును సమాన ధర్మము. క్రౌర్య దర్పములు గల స్త్రీలు గలరనుటచే అవర్ణ్యమైన మృత్యువునకు అనాదరము లభించినది.

10. వర్ణ్యేనాన్యస్యోపమాయా అనిష్పత్తి వచశ్చతత్ ।
ముధాపవాదో ముగ్ధాక్షి! త్వన్ముఖాభం కిలామ్బుజమ్॥

గీ. వర్ణ్యమున నుపమానాన్య వస్తువునకు
దగ ననిష్పత్తి వచనంబు దవుల నిదియు
ధవళ నయన! మృషాపవాదంబు యుష్మ
దానన సమాన మానంట యంబుజంబు. 16

వర్ణ్యమును ఉపమానముగాను అవర్ణ్యమును ఉపమేయముగాను స్వీకరించి పోలికచెప్పినను ఆ పోలిక కుదరదన్నచో అదియును ప్రతీపాలంకారము.

"ఓ ధవళ నయనా! పద్మము నీ ముఖముతో సమానమౌననుట వట్టి మిథ్యాపవాదము" ఇందు ముఖము వర్ణ్యము. అవర్ణ్యమైన ఉపమాన వస్తువు పద్మము. రెండిటికిని సామ్యము లోకప్రసిద్ధము. అట్లుకాదని పద్మమునే ముఖముతో పోల్చినను అది ప్రతీపాలంకారమగును. ఇచ్చట అట్టి పోలికయే అసంభవమనియు, అది మిథ్యాపవాదమనియు చెప్పబడు చుండుటచేత ఉపమానమగు పద్మము మిక్కిలి తిరస్కరింపబడుచున్నది. వర్ణ్యమైన ముఖమునకు ప్రకృష్టత చేకూరుచున్నది.

11. ప్రతీప ముపమానస్య కై మర్థ్య మపి మన్వతే
దృష్టం చేద్వదనం తన్వ్యాః కిం పద్మేన? కిమిన్దునా?

గీ. తనరు నుపమాన కైమర్థ్యమును బ్రతీప
మనగఁ గావ్యములందు, నీయలరుఁబోఁడి
నెమ్మొగము చూడఁబడెనేని నీరజముల
తోడ నేమి? సుధాంశునితోడ నేమి? 17

ఉపమానము యొక్క ప్రయోజనము ఉపమేయము చేతనే లభించు చుండగా ఉపమానము నిష్ప్రయోజనమని చెప్పినను ప్రతీపమే యగును.

"ఈ అలరుబోడి ముఖమును చూచిన యెడల పద్మ మెందులకు? చంద్రు డెందులకు?" ఇచ్చట వర్ణ్యము వదనము, అవర్ణ్య వస్తువులు పద్మ చంద్రులు. పద్మమును, చంద్రుని దర్శించుటచే కలిగెడి ఆనందము ఆమె ముఖమును దర్శించుట చేతనే కలుగుచున్నది కావున పద్మమును,

చంద్రుడును నిష్ప్రయోజనము అగుచున్నవి. దీనివలన ముఖము యొక్క ఆధిక్యము స్పష్టమగుచున్నది. కనుక ప్రతీపము.

## 5. రూపకాలంకారము

12. విషయ్యభేద తాద్రూప్య రఞ్జనం విషయస్య యత్।
రూపకం తత్త్రిధాధిక్య న్యూనత్వానుభయోక్తిభిః॥

గీ. ప్రకటమగునట్టి విషయంబునకు విషయ్య
భేద తాద్రూప్య రంజనం బేది యదియ
రూపకం బిది మూఁడు తీరులఁదనర్చు
నధికతా న్యూనతా నుభయవచనాప్తి. 18

విషయమునకు (ఉపమేయమునకు) విషయితో (ఉపమానముతో) అభేదమునుగాని, తాద్రూప్యమునుగాని చెప్పిన యెడల అది రూపకాలంకారము.

ఈ రూపకాలంకారము అభేద రూపకాలంకారము, తాద్రూప్య రూపకాలంకారము అని రెండు రకములు. ఈ రెండును మరల అధికోక్తి, న్యూనోక్తి, అనుభయోక్తి అని మూడేసి విధము అగుచున్నది. దీనిని బట్టి 1. అధికాభేద రూపకము, 2. న్యూనాభేద రూపకము, 3. అనుభయాభేద రూపకము, 4. అధిక తాద్రూప్య రూపకము, 5. న్యూనతాద్రూప్య రూపకము, 6. అనుభయతాద్రూప్య రూపకము అని మొత్తము రూపకాలంకారము ఆరు విధములు.

13. అయంహి ధూర్జటి స్సాక్షాద్యేన దగ్ధాః పురః క్షణాత్।
అయమాస్తేవినా శమ్భుస్తార్తీయీకం విలోచనమ్॥

14. శమ్భుర్విశ్వ మవత్యద్య స్వీకృత్య సమదృష్టితామ్।

క. ఈతండే కద సాక్షా
ద్భూతేశుఁడు క్షణములోనఁ బురములు భస్మీ
భూతంబులయ్యె నెవ్వని
చేత ననగ లక్ష్యమమరు శేషవిభూషా ! 19

గీ. ఉన్నవాఁ డీతఁడే తిగ కన్ను లేని
శంభుఁడవుచును; శంభు డీసమయమునను
విశ్వమేలెడి సమదృష్టి స్వీకరించి
యనఁగ నివి లక్ష్యములగు శశాంకమౌళి! 20

'ఎవనిచేత క్షణములో పురములు భస్మీభూతము లైనవో ఆ భూతేశు డితడేకదా!' అనుచో రాజునకు, శివునకు అభేదము కల్పింపబడినది. ఇందు రాజునకు, శివునికంటె అధిక్యముగాని, న్యూనతగాని పేర్కొనబడలేదు. కావున ఇది అనుభయాభేద రూపకము.

'మూడవ కన్నులేని శంభుడీతడే' అనుచో రాజునకు, శివునకు అభేదము చెప్పబడినది. కాని మూడవకన్ను లేక పోవుట యను ఒక న్యూనత రాజునకు ప్రకటింప బడుటచే ఇది న్యూనాభేద రూపకము

'శంభుడు ఇప్పుడు సమదృష్టితో విశ్వమేలుచున్నాడు' అనుచో రాజునకు శివునకు అభేదము తెలుపబడినను శివునికి లేని సమదృష్టి (శివుడు మూడు కన్నులు కలిగియుండుటచే విషమ దృష్టి) రాజునకు అధికముగా చెప్పబడుటచే నిది అధికాభేద రూపకము.

అస్యాముఖేన్దునా లబ్ధే నేత్రానన్దే కిమిన్దునా॥

15. సాధ్వీయ మపరా లక్ష్మీ రసుధా సాగరోదితా।
అయం కళంకినశ్చన్ద్రా న్ముఖచన్ద్రో౽తిరిచ్యతే॥

క. దీని ముఖేందునిచే నే
త్రానందము నాకు లబ్ధమగుచుండంగా
నాసిండు కలువ నెచ్చెలి
చే నేమగునన్నయట్లు శీతాంశుధరా ! 21

గీ. సాధ్వి యిది యసుధార్ణవ జాతయైన
యపరలక్ష్మి కళంకి యైనట్టి విధుని
కంటె మీాఱెడు ముఖసుధాకరుఁడనంగ
లక్ష్యములుగాఁ దనర్చు నిలాళితాంగ ! 22

'ఈమె ముఖచంద్రునిచేతనే నాకు నేత్రానందము లభించు చుండగ ఇక ఆ నిండుచంద్రునితో నేమిపని?' అనుచో ముఖము, చంద్రుడు భిన్న వస్తువు లైనను ముఖమే చంద్రుడుగా ఆరోపింప బడినది. 'ఆరోపయఽ రూపయుక్తం కరోతీతి రూపకమ్' అను నిర్వచనము రూపకమును సార్థకము చేయుచున్నది. ఇందు ముఖమునకు చంద్రునికంటె న్యూనతగాని, ఆధిక్యముగాని చెప్పబడలేదు. కావున అనుభయతాద్రూప్య రూపకము.

'ఈ సాధ్వి పాలసంద్రమున పుట్టని అపర లక్ష్మి.' అనుచో వర్ణ్యమునకు క్షీరసముద్రమున పుట్టకపోవుట అను ఒక న్యూనత పేర్కొన బడినది కావున న్యూనతాద్రూప్య రూపకము

'ఈ ముఖ సుధాకరుడు కళంక సహితుడైన చంద్రుని మీఱు చున్నాడు.' అనుచో ముఖమునకు చంద్రత్వము ఆరోపింప బడుటచే

తాద్రూప్య రూపకము చంద్రునకు గల కళంకము ముఖమునకు లేదని ఆధిక్యము తెలుపుటచే నిది అధిక తాద్రూప్య రూపకాలంకారము.

## 6. పరిణామాలంకారము

16\. పరిణామః క్రియార్థశ్చేద్విషయీ విషయాత్మనా ।
ప్రసన్నేన దృగబ్జేన వీక్షతే మదిరేక్షణా॥

గీ. విషయి విషయాత్మతను గ్రియాన్వితమైన
నదియుఁ బరిణామ మనఁగఁ బ్రఖ్యాతి కెక్కు
నవనిలోనఁ బ్రసన్నేక్షణాంబుజమున
నాయతేక్షణ చూచెడి ననఁగ శర్వ! 23

విషయి (ఉపమానము) విషయము (ఉపమేయము)తో తాదాత్మ్యము మును పొంది క్రియను నిర్వహించిన అది పరిణామాలంకారము. ఉపమానము ఉపమేయముతో సమాన ధర్మము నందినను, ప్రకృత కార్యమును సాధించుటకు తాను అసమర్థ మగుటచే ఉపమేయముతో తాదాత్మ్యమును పొందుచున్నది. అనగా పరిణామ మందుచున్నది.

'ఆయతేక్షణ (విశాలమైన నేత్రములు కలది) ప్రసన్నమైన ఈక్షణాంబుజముతో చూచుచున్నది.' ఇచట చూచుచున్నది అంబుజము. నేత్రము కానేకాదు. కాని అంబుజము స్వయముగా చూడగలదా ? లేదే ! కావున అంబుజము నేత్రముగా పరిణమించినదని తెలిసికొనవలసియున్నది. అంబుజము ఉపమానము, నేత్రము ఉపమేయము. అంబుజము నేత్రముగా పరిణామము నొంది క్రియను నిర్వహించుచుండుటచే నిది పరిణామాలంకారము.

## 7. ఉల్లేఖాలంకారము

17. బహుభిర్బహుధోల్లేఖా దేకస్యోల్లేఖ ఇష్యతే।
స్త్రీభిః కామోఽర్థిభిస్స్వర్ద్రుః కాలశ్శత్రుభిరైక్షిసః॥

గీ. పెక్కు విధముల నొక్కనిఁ బెక్కువారి
లెన్న నుల్లేఖ మగునది యెటులనన్న
అతఁడు గన్పట్టె నింతుల కతనుఁడనఁగ
అర్థులకుఁ గల్పకము, కాలుఁ డరుల కనఁగ. 24

ఒకే వస్తువును అనేక వ్యక్తులు తమ కిష్టమైన రీతిలో అనేకవిధముల వర్ణించి చెప్పిన నది ఉల్లేఖాలంకారము. ఉల్లేఖ మనగా వర్ణనము.

అతడు ఇంతులకు మన్మధునిగను, అర్థులకు కల్పవృక్షముగను, శత్రువులకు యమునిగను కన్పట్టెను.

స్త్రీలు సౌందర్య లక్షణముచే మన్మధునిగా తలంచిరి. యాచకులు దాతృత్వ లక్షణముచే కల్పవృక్షమునుగ తలచిరి. శత్రువులు పరాక్రమ లక్షణముచే యమునిగ తలంచిరి. ఒకే వ్యక్తి పలువురిచేత పలువిధముల పోల్చబడుటచే ఇది ఉల్లేఖాలంకారము. ఇది ఉల్లేఖమునం దొక భేదము వేరొక భేదము:

18. ఏకేన బహుధోల్లేఖేప్యసౌ విషయభేదతః।
గురుర్వచస్యర్జునోఽయం కీర్తౌ భీష్మశ్శరాసనే॥

గీ. అమిత గతులగు విషయ భేదముల నొకని
చేత నుల్లేఖ మొదవినఁ జెలఁగు నదియు
గురుఁడు వచనంబులందున నరుఁడు కీర్తిఁ
జాపమున భీష్ముఁ డతఁడన్న చందమునను. 25

ఒకే వ్యక్తి ఒకే వస్తువును విషయభేదముచేత పలురీతులుగ ఉల్లేఖించినను అది ఉల్లేఖాలంకారమే యగును.

అతడు వాక్కులయందు బృహస్పతి, కీర్తియందు అర్జునుడు, ధనుర్విద్యయందు భీష్ముడు అనుచో ఒకే వ్యక్తి వేర్వేరు ధర్మములందు వేర్వేరు వ్యక్తులతో సమానధర్మమునంది వర్ణింప బడుటచే ఇది ఉల్లేఖము.

గురుడు వచనంబుల, నరుడు కీర్తి, భీష్ముడు చాపవిద్యను ఈ మూడింటిని విడి విడిగా చూచిన రూపకాలంకారము లగును. కాని ప్రాధాన్యమును బట్టి మొత్తముమీద ఉల్లేఖమునే ఇచట పేర్కొనవలయును.

8, 9, 10 స్మృతి, భ్రాన్తి, సందేహాలంకారములు.

19. స్యాత్ స్మృతి భ్రాన్తి సన్దేహై స్తదంకాలం కృతిత్రయమ్ ।
పంకజం పశ్యతః కాంతాముఖం మే గాహతే మనః॥

20. అయం ప్రమత్త మధుప స్త్వ న్ముఖం వేత్తి పంకజమ్ ।
పంకజంవా సుధాంశు ర్వేత్యస్మాకంతు న నిర్ణయః॥

గీ. అలరు స్మృతి భ్రాంతి సందేహ పదములఁ
దగు నలంకారములు మూఁడు; తమ్మిఁ జూచు
నాదు డెందంబు వికసిత నలిననేత్ర
యాస్యమున కగ్గమయ్యెడి ననఁగ శర్వ. 26

ఆ. ఈ ప్రమత్త మధుప మెఱిఁగెడి నీ మోము
పంకజంబటంచుఁ బంకజంబొ
యమృతకరుఁడొ నిర్ణయము లేదు మాకైన
ననఁగ లక్ష్యములు సుధాంశుమకుట. 27

తొలిసారిగా లభించునది అనుభవము, అది జ్ఞప్తికి వచ్చుట స్మృతి. అనుభవ జ్ఞానము స్మృతి.

ఉపమానోపమేయములలో ఒక వస్తువును దర్శించిన వేరొక వస్తువు స్మరింపబడినచో అది స్మృత్యలంకారము

ఉపమానోపమేయములలో సమాన ధర్మమును బట్టి భ్రాంతిచే ఒక దానిని వేరొకదానినిగా ఊహించిన భ్రాంతిమదలంకారము. మిథ్యా జ్ఞానము భ్రాంతి.

అనిశ్చయ జ్ఞానము సందేహము. వర్ణ్యావర్ణ్యముల విషయమున సమానధర్మ సారూప్యముచే అదియా ? ఇదియా ? అను సందేహము కలిగిన అది సందేహాలంకారము.

'పద్మమును చూచుచున్న నాదు మనము కాంతాముఖమునకు ఆధీన మగుచున్నది.' పద్మమును దర్శించుటచే తత్సాదృశ్యముగల కాంతా ముఖము జ్ఞప్తికి వచ్చినది. సదృశ వస్తు స్మరణము చెప్పబడుటచే ఇది స్మృత్యలంకారము.

'ఈ కొదమ తుమ్మెద నీ మోమును పంకజ మనుకొను చున్నది' అనుచో తుమ్మెద మోమును చూడగనే పద్మమని భ్రాంతిచెందినది. కావున భ్రాంతిమదలంకారము.

'ఆమె వదనము అంబుజమో ? అమృతకరుడో ? మాకు నిర్ణయ మగుటలేదు.' అనుచో ముఖము పద్మమా ? చంద్రుడా ? అని సందేహము, ముఖమునకు పద్మత్వము చంద్రత్వము కూడా నుండుటచే ఏమనవలయునో సందేహము కలుగుచుండుటచే నిది సందేహాలంకారము.

## 11. అపహ్నుత్యలంకారము

21. శుద్ధాపహ్నుతి రన్యస్యారోపార్థో ధర్మనిహ్నవః ।
నాయం సుధాంశుః కిం తర్హి వ్యోమ గంగా
సరోరుహమ్॥

గీ. అన్యధర్మంబు నిలుప, లేదందు ధర్మ
మపరయేని శుద్ధాపహ్నుతి నెగడుఁ గృతి
నితఁడు గాఁడు సుధాంశు డదేమి యనిన
నభ్రగంగా సరోరుహం బన్నయట్లు. 28

అపహ్నుతి అనగా కప్పిపుచ్చుట అపహ్నుత్యలంకారము ఆరు విధములు. 1. శుద్ధాపహ్నుతి, 2 హేత్వపహ్నుతి, 3. పర్యస్తాపహ్నుతి, 4 భ్రాంతాపహ్నుతి, 5. ఛేకాపహ్నుతి, 6. కైతవాపహ్నుతి.

ప్రకృత వస్తువునందు అన్యవస్తు ధర్మమును నిలుపుటకై ఆవస్తువు యొక్క స్వధర్మమును కప్పిపుచ్చుట శుద్ధాపహ్నుత్యలంకారము.

'ఇతడు చంద్రుడుగాడు, మఱి యేమి ? ఆకాశగంగలోని పద్మము' అనుచో చంద్రునియందు ఇతర ధర్మమైన అభ్రగంగా సరోరుహత్వము నిలుపుటకు స్వధర్మమైన చంద్రత్వము కప్పిపుచ్చబడినది కాబట్టి శుద్ధాపహ్నుతి

22. స ఏవ యుక్తి పూర్వశ్చే దుచ్యతే
హేత్వపహ్నుతిః ।
నేష్ణుస్తీవ్రో న నిశ్యర్కస్సిన్ధోరార్వోఽయముత్థితః॥

గీ. అదియుకద యుక్తిపూర్వక మయ్యెనేని
హేత్వపహ్నుతి యనఁగను గృతులఁ బేర్చుఁ
గాఁడు శశి తీవ్రుఁ, డర్కుండు లేఁడు రాత్రి
వనధిగర్భ సముత్థితౌర్వం బితండు. 29

పైన తెల్పిన శుద్ధాపహ్నుతియే యుక్తిపూర్వకముగా నున్న యెడల అది హేత్వపహ్నుత్యలంకారము.

విరహావస్థలో నున్న ఒక యువతి చంద్రుని ఈరీతిని నిందించుచున్నది. 'ఇతడు చంద్రుడనుకొందుమా తీవ్రముగా నున్నాడు. సూర్యుడనుకొందుమా రాత్రి సమయమున సూర్యుడుండడుకదా! కనుక ఇది సముద్రమునుండి పైకి తేచిన బడబానలము.' ఇట చంద్రునియందు తద్ధర్మములను అపహ్నవించి బడబానలత్వము నారోపించుటకు కొన్ని కారణముల పేర్కొనబడినవి. చంద్ర సూర్యత్వములు రెండును నిషేధింపబడి తీవ్రత్వము కారణముగ బడబానలత్వము యుక్తి పూర్వకముగ పేర్కొనబడటచే ఇది హేత్వపహ్నుత్యలంకారము.

23. అన్యత్ర తస్యారోపార్థః పర్యస్తాపహ్నుతిస్తు సః ।
నాయం సుధాంశుః కిం తర్హి సుధాంశుః ప్రేయసీ
ముఖమ్ ॥

క. కృతి నగుఁ బర్యస్తాప
హ్నుతి పెరచోట నుపమానము నునుచుటకై ని
హ్నుతిఁ జేసినఁ గాఁడితఁడు
సితకిరణుడు విధుఁడు ప్రేయసీముఖమనగన్. 30

ఒక వస్తువునందు తద్ధర్మము లేదని చెప్పి దానిని వర్ణనీయ వస్తువునందు ఆరోపించినచో అది పర్యస్తాపహ్నుత్యలంకారము.

'ప్రేయసి ముఖమే చంద్రుడు కాని ఈతడు చంద్రుడు కాడు.' అనుచో వర్ణనీయ వస్తువు ముఖము. ముఖమునందు చంద్రత్వము నారోపించుట కొరకు చంద్రునియందు ఆతని ధర్మమగు చంద్రత్వము లేదని పేర్కొనబడినది కావున ఇది పర్యస్తాపహ్నుతి.

24. భ్రాన్తాపహ్నుతి రన్యస్య శంకాయాం భ్రాన్తివారణే।
తాపం కరోతి సోత్కమ్పం జ్వరః కిం? నసఖిస్మరః॥

గీ. భ్రాంతి వారింపఁబడెనేనిఁ బరుని శంకఁ
దేజరిల్లు భ్రాంతాపహ్నుతి యనఁ గృతులఁ
దాప పఱచెడి మిత్ర! సోత్కంపముగను
జ్వరమ? యది కాదు మరుఁ డన్న చందమునను. 31

ఒక వస్తువు వేరొక వస్తువుగా శంక కలిగినప్పుడు యదార్థమును తెలియజేసి భ్రాంతిని పోగొట్టుట భ్రాంతాపహ్నుత్యలంకారము

"మిత్రుడా! మిక్కిలి వణకించుచు నాకు తాపము కలుగుచున్నది.' దేనివలన? 'జ్వరమా?' 'కాదు మరుని వలన" అనుచో తాపము జ్వరము వలననా? అని మిత్రుడడుగగా కాదు మన్మధుని కారణమున అని యదార్థమును తెలుపుటద్వార భ్రాంతిని నివారించుటచే నిది భ్రాంతాపహ్నుత్యలంకారము.

25. ఛేకాపహ్నుతి రన్యస్య శంకాత స్తథ్యనిహ్నవే।
ప్రజల్పన్మత్పదేలగ్నః కాంతః కిమ్?నహి నూపురః॥

గీ. తేజరిల్లు ఛేకాపహ్నుతి పరశంక
వలనఁగద తథ్యనిహ్నవం బలరెనేని
రొండ రొయునర్చుచుఁ దవిలె మత్పదములందు
నధిపుఁడా? కాఁడు, నూపురం బన్నయట్లు. 32

భ్రాంతాపహ్నుతి కిది విపర్యయము. ఛేకు డనగా నేర్పుగలవాడు. ఇతర వస్తువుయొక్క శంక కలిగినప్పుడు యదార్థమును దాచిపుచ్చి తన నేర్పు చే మాయచేసి పల్కిన అది ఛేకాపహ్నుతి

'నా పదములపడి చాల గొడవచేసె' 'నీ భర్తయా?' 'కాదు కాలి అందె' అనుచో ఒక యువతి తన చెలికత్తెతో తన ప్రియుని వృత్తాంతమును తెలుపుచుండగా అవటికి వేరొక యువతి వచ్చి 'నీ కాంతుడా?' అని అడుగుటతో ఆమెకు నిశ్చయ జ్ఞానము లేదని తెలియుటచే యధార్థమును మరుగుపరచి 'కాదు. కాలి అందె' అని మాయచేయుటచే నిది ఛేకాపహ్నుతి.

26. కైతవాపహ్నుతి ర్వ్యక్తౌ వ్యాజాద్యైర్నిహ్నుతేః పదైః।
నిర్యాన్తి స్మరనారాచాః కాన్తా దృక్పాత కైతవాత్॥

గీ. వ్యాజముఖపదముల నిహ్నవంబు నెగడఁ
గైతవాపహ్నుతి యఁటండ్రు కవిజనములు
కామినీ జన దృక్పాత కైతవమున
నతను శరములు వెలువడు నన్నయట్లు.

వ్యాజము, మిష. కైతవము, ఛలము ఇత్యాది పదములచేత అపహ్నవము స్పష్టముగా నుండిన అది కైతవాపహ్నుతి.

'కాంతామణుల చూపు లనెడి మిషతో మన్మధుని బాణములు వెలువడు చున్నవి ' అనుచో స్త్రీల చూపులందు మిషతో మన్మధ బాణత్వము ఆరోపిప బడుటచే వీక్షణత్వము మరుగుపరచబడినది కనుక నిది కైతవాపహ్నుతి.

## 12. ఉత్ప్రేక్షాలంకారము

27. సంభావనాస్యా దుత్ప్రేక్షా వస్తుహేతు ఫలాత్మనా ।
ఉక్తానుక్తా స్పదా ద్యాత్ర సిద్ధాసిద్ధాస్పదే పరే॥

క. విదితము లుత్ప్రేక్షలు పెం
పొదవెడుఁ గావ్యములయందు నుక్తానుక్తా
స్పదమును సిద్ధాసిద్ధా
స్పదము ననన్ వస్తు హేతు ఫలరూపమునన్. 34

అన్యధర్మ సంబంధ నిమిత్తముచేత అన్యవస్తువునకు అన్యతాదాత్మ్య సంభావనము ఉత్ప్రేక్షాలంకారము. సొగసుగా ఊహించుట ఉత్ప్రేక్ష. ఉపమేయ ధర్మము ఉపమానమునం దుండుటచే ఉపమేయమునకు ఉపమాన తాదాత్మ్యమును ఊహించి చెప్పుట ఉత్ప్రేక్ష. ఈ ఉత్ప్రేక్ష ప్రధానముగా మూడు భేదములు. 1. వస్తూత్ప్రేక్ష, 2 హేతూత్ప్రేక్ష, 3. ఫలోత్ప్రేక్ష. ఒక వస్తువునకు మరియొక వస్తువుయొక్క తాదాత్మ్యమును ఊహించి చెప్పుట వస్తూత్ప్రేక్ష. దీనినే స్వరూపోత్ప్రేక్ష అనియు అందురు. హేతువు కానిదానిని హేతువుగా నూహించుట హేతూత్ప్రేక్ష. ఫలము కానిదానిని ఫలముగా ఊహించుట ఫలోత్ప్రేక్ష. ఈ మూడును మరల ఒక్కొక్కటి రెండేసి విధములు.

1. వస్తూత్ప్రేక్ష – ఉక్తవిషయ వస్తూత్ప్రేక్ష, అనుక్తవిషయ వస్తూత్ప్రేక్ష.
2. హేతూత్ప్రేక్ష – సిద్ధవిషయ హేతూత్ప్రేక్ష, అసిద్ధ విషయ హేతూత్ప్రేక్ష.

3. ఫలోత్ప్రేక్ష – సిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష, అసిద్ధవిషయ ఫలోత్ప్రేక్ష.

ఇట్లు ఉత్ప్రేక్ష మొత్తము ఆరు విధములు.

28. ధూమస్తోమం తమశ్శంకే కోకీ విరహ శుష్మణామ్ ।
లిమ్పతీవ తమోంగాని వర్షతీవాంజనం నభః ॥

గీ. చక్రవాకీ వియోగాగ్ని జనిత ధూమ
సమితి యని శంకచేసెదఁ దిమిర పటలి
తమము కురిసెడిఁబలె నుండె ఖము గనియెడు
నంగము లలఁదునది బలె నంజనంబు.

వస్తూత్ప్రేక్షలోని ఉక్తానుక్తములకు ఇట ఉదాహరణము లీ బడినవి.

'ఈ చీకటిని చక్రవాకీ విరహాగ్నిచే జనించిన ధూమసమితి గ తలంచెదను.' అనుచో విషయి పొగ, విషయము చీకటి, సర్వత్రావ్యాప్తి నైల్యత్వము, దృష్టి ప్రతిరోధకత్వము విషయి యగు ధూమమునకు ధర్మములు అవి విషయమునకును అనగా చీకటికిని వర్తించుచున్న వి విషయి తాదాత్మ్యము విషయమునకు స్పష్టముగా చెప్పబడుటచే (ఉక్తమగుటచే) ఇది ఉక్త విషయ వస్తూత్ప్రేక్ష

'చీకటి అంగములకు పూతపూయుచున్నట్లున్నది.' అనుచో విషయి (చీకటి) చెప్పబడినది. విషయము చెప్పబడలేదు. 'అంగములకు పూత పూయు చున్నట్లు చీకటి వ్యాపించుచున్నది.' అని యున్నచో విషయమును విషయియు రెండును ప్రసక్తము లయ్యెడివి. "వ్యాపించుట" అను విషయము అనుక్త మగుటచే నిది అనుక్త విషయవస్తూత్ప్రేక్ష. అట్లే—

"ఆకాశము కాటుకను వర్షించుచున్నట్లున్నది." అనుచో ఆకాశము కాటుకను వర్షించుచున్నట్లు చీకటి వ్యాపించుచున్నది. అను విషయము అనుక్త మగుటచే నిదియు అనుక్తవిషయ వస్తూత్ప్రేక్ష,

29. రక్తౌ తవాంఘ్రీ మృదులౌ భువివిక్షేపణాద్ధ్రువమ్ ।
త్వన్ముఖాభేచ్ఛయా నూనం పద్మైర్వైరాయతే శశీ॥

గీ. అవని మోచుట వలనసూ యరుణములు భ
వన్మృదు పదాంబుజములు ధ్రువంబనంగ
ద్వన్ముఖాచ్ఛేచ్ఛచేతఁ బద్మములతోడఁ
బగయొనర్చెడి యామినీ భర్త యనఁగ. 36

హేతూత్ప్రేక్షలోని సిద్ధ విషయ, అసిద్ధ విషయముల కిపుడు లక్ష్యములు చూపబడుచున్నవి.

"నీ మృదుపదములు భువిని మోపుటచే అరుణములైనవని తలంచుచున్నాను" ఉత్తమ స్త్రీల పదములు సహజముగనే అరుణములు. కాని పాదము లెఱ్ఱబడుటకు నేలమీద మోపు హేతువుగ నూహింపబడినది. పాదములు నేలను మోవుట సిద్ధ విషయము. (హేతువు కానిదానిని హేతువుగా నూహించుట ఇచట సరిపడినది) కావున నిది సిద్ధవిషయ హేతూత్ప్రేక్ష.

"నీ ముఖ కాంతిని పొందగోరి చంద్రుడు పద్మములతో పగబూని యున్నాడు." అనుచో ముఖకాంతిని పొందగోరుటయే పగబూనుటకు హేతువుగా తెలుపబడినది. యదార్థమునకు చంద్రునకు అట్టి కోరిక అసంభవము. కావున "ముఖ కాంతిని పొందగోరుట" అనునది అసిద్ధవిషయము కాన నిది అసిద్ధవిషయ హేతూత్ప్రేక్ష.

30. మధ్యః కిం కుచయోర్ధృత్యై బద్ధః కనకదామభిః ।
ప్రాయోఽబ్జం త్వత్పదేనైక్యం ప్రాప్తుం తోయే
తపస్యతి॥

గీ. కట్టఁబడెనేమొ మధ్యంబు కనకదామ
ములను వక్షోజ ధారణంబునకు ననఁగఁ
ద్వత్పదైక్యము గనఁగఁ బద్మములు నీటఁ
దపముచేసెడి ననెడి చందమున శర్వ. 37

ఇపుడు ఫలోత్ప్రేక్షకు లక్ష్యములు చూపబడుచున్నవి. ఫలోత్ప్రేక్ష సిద్ధవిషయము, అసిద్ధవిషయము నని రెండు విధములని తెలుసుకొంటిమి.

"కుచములను ధరించుటకై నీనడుము బంగారు గొలుసులతో కట్టబడినదా ఏమి?" అనుచో బంగారు గొలుసులతో బంధింప బడుటకు కుచధారణము ఫలముగా పేర్కొనబడినది. ఆ బంధనము లేకున్నను నడుము సహజముగనే కుచధారణము చేయుచునే యుండును ఇది సిద్ధ విషయము. ఇట్లు ఫలము కానిదానిని ఫలముగా నూహించుటచే నిది సిద్ధ విషయ ఫలోత్ప్రేక్ష.

'నీ పదముతో నైక్యము పొందగోరి పద్మము నీటియందు తపము చేయుచున్నది.' పద్మమునకు జలావాసము తపమాచరించుటకు కాదు. కామినీ పదైక్యము ఫలమును కాదు. పద్మము కామినీ పదైక్యమును ఫలముగా కోరుట అసంభవము కావున ఇది అసిద్ధ విషయము, అంతియే కాక ఫలము కానిదానిని ఫలముగా కూడ నూహించుటచే నిది అసిద్ధ విషయఫలోత్ప్రేక్ష.

క. వలెనను పదంబు మొదలుగఁ
దగ ధ్రువముగ శంకఁ జేసెదను నిశ్చయమన్
పలుకులతోఁ బాసిన వ
ర్తిలు గమ్యోత్ప్రేక్ష యనఁగఁ గృతుల మహేశా. 38

'వలె, నిజముగా, తలచెదను, శంకించెదను' ఇత్యాది పదములు లేని ఉత్ప్రేక్ష గమ్యోత్ప్రేక్ష అని చెప్పబడును, ఫలోత్ప్రేక్ష కిచ్చిన ఉదాహరణములు రెండును గమ్యోత్ప్రేక్షకును సరిపడును.

## 13. అతిశయోక్త్యలంకారము

31. రూపకాతిశయోక్తి స్స్యా న్నిగీర్యాధ్యవసానతః ।
పశ్య నీలోత్పల ద్వంద్వా న్నిస్సరంతి శితాశ్శరాః॥

క. రూపకాతిశయోక్తి పేర్చు నుపమాన
మాత్రము వచించి వర్ణ్యంబు మాటిరేని
నల్ల దొవకవఁ గ్రొవ్వాడి నారసములు
వెలువడె ననంగ లక్ష్మమా నలిక నేత్ర. 39

అతిశయ వర్ణనముచే అతిశయోక్తి అని చెప్పబడును. ఈ అతిశయోక్త్యలంకారము ఎనిమిది విధములు, 1. రూపకాతిశయోక్తి, 2 సాపహ్నవాతిశయోక్తి, 3. భేదకాతిశయోక్తి, 4. సంబంధాతిశయోక్తి, 5. అసంబంధాతిశయోక్తి, 6. అక్రమాతిశయోక్తి, 7. చపలాతిశయోక్తి, 8. అత్యంతాతిశయోక్తి.

ఉపమేయమును మఱుగుపరచి ఉపమానము మాత్రమే ప్రకటించిన అది రూపకాతిశయోక్తి.

నల్లకలువల జంటనుండి వాడి బాణములు వెలువడుచున్నవి. ఇందు నల్లకలువల జంట ఉపమానము, ఆ యువతి నేత్రద్వయము ఉపమేయము. వాడి బాణములు ఉపమానము. ఆ యువతి చూపులు ఉపమేయము. ఇచట ఉపమేయములు చెప్పబడక ఉపమానములు మాత్రమే చెప్పబడినవి.

ఆమె నేత్రద్వయము అను ఉపమేయము కప్పిపుచ్చబడి నీలోత్పల ద్వంద్వమను ఉపమానముతో అధ్యవసానము చేయబడినది. అట్లే చూపులు అను ఉపమేయము నిగరణము చేయబడి వాడియైన బాణములు అను ఉపమానముతో అధ్యవసానము చేయబడినవి. కాబట్టి ఇది రూపకాతిశయోక్తి.

32. యద్యపహ్నుతి గర్భత్వం సైవ సాపహ్నవా మతా।
త్వత్సూక్తిషు సుధా రాజన్! భ్రాన్తాః పశ్యంతి తాం విధౌ॥

గీ. అగు నపహ్నుతి గర్భత్వ మయ్యెనేని
నదియ సాపహ్నవాఖ్యయౌ యతిశయోక్తి
యుష్మదుక్తుల సుధ వెల్గుచుండ దాని
భ్రాంతు లీక్షించుదురు నిశాభర్త యందు. 40

ఈ రూపకాతిశయోక్తి అపహ్నుతితో కూడియుండిన అది సాపహ్నవాతిశయోక్తి.

ఓ రాజా! అమృతము నీమాటలయందుండగా భ్రాంతులు దానిని చంద్రునియందు వెదకుచున్నారు.

ఇందు నీ మాటలయందున్న మాధుర్యమే అమృతము అనుట అతిశయోక్తి. చంద్రబింబములోని అమృతము అపహ్నవము (కప్పిపుచ్చుట) చేయబడుటచే నిది సాపహ్నవాతిశయోక్తి.

33. భేదకాతిశయోక్తి స్స్యాత్తస్యైవాన్యత్వ వర్ణనమ్ ।
అన్యదేవాస్య గాంభీర్య మన్యద్ధైర్యం మహీపతేః॥

గీ. అన్యథాఖ్యాప్తి యద్దాని కయ్యెనేని
భేదకాతిశయోక్తినాఁ బెంపుమీఱు
వింత యీతని గాంభీర్య విలసనములు
వింత యీతని ధీరతా విభవమనఁగ. 41

లోకసామాన్యవిషయమునకే అన్యత్వ వర్ణనము చేయబడిన యెడల అది భేదకాతిశయోక్తి.

'ఈతని గాంభీర్య విలసనము వేఱు' లోకప్రసిద్ధములైన గాంభీర్య ధైర్యములకంటె ఇతని గాంభీర్యధైర్యములు భిన్నములని యర్థము. రాజుకు లోకోత్తరత్వము నిరూపించుటకే ఇట్లు చెప్పబడినది. లోకసామాన్యమైన గాంభీర్య ధైర్యములు, ఈతని గాంభీర్య ధైర్యములు ఒక జాతిలోవే. కాని వానికి భేదము చెప్పబడినది. కావున ఇది భేదకాతిశయోక్తి.

34. సంబంధాతిశయోక్తి స్స్యాదయోగే యోగకల్పనమ్ ।
సౌధాగ్రాణి పురస్యాస్య స్పృశంతి విధుమండలమ్॥

క. ఇంబడరు కావ్యముల యో
గం బొదవక యుండ యోగకల్పనమైనన్
సంబంధాతిశయోక్తి పు
రిం బలుసౌధములు విధుని స్పృశియించెడి నాన్. 42

సంబంధము లేనిచోటుల సంబంధ మున్నదని ప్రకటించిన అది సంబంధాతిశయోక్తి

ఆ పట్టణము నందలి సౌధాగ్రములు చంద్రమండలమును తాకు

ణమునకు సౌధాగ్రములు చంద్రమండలమును తాకుట లేదు.
నను తాకుచున్నట్లు (సంబంధమున్నట్లు) వర్ణింపబడినది. కావున
తిశయోక్తి. ఇచట భవనముల ఔన్నత్యము గమ్యమానము

యోగేఽప్యయోగోఽసబంన్ధాతిశయోక్తి రితీష్యతే।
త్వయి దాతరి రాజేంద్ర! స్వర్ద్రుమాన్నాద్రి
యామహే॥

యోగ మొదవుచు నుండి సుయోగ మొదవ
పన్న మును చెప్పనదియయై యొప్పఁ గృతుల
దాత వీవగుచుండఁగ ధరణినాథ!
యాదరింపము దివిజ ద్రుమాళి నాగ. 43

సంబంధ మున్న తావుల, ఆ సంబంధము లేదని ప్రకటించిన నది
ంధాతిశయోక్తి.

ఓ రాజా! నీవు దాతవై యుండగా మేము కల్పవృక్షముల
పము.

యాచకులకు కల్పవృక్షాదులయందు ఆదరముండుట సహజము
ర్కెలను తీర్చుకొనుట కొరకు యాచకులు కల్పవృక్షాదుల నాశ్ర
ట సిద్ధమైయుండ తత్సంబంధము నిరాకరింపబడుటచే నిది అసంబం
యోక్తి.

గీ. ఒప్పు కృతిఁ జపలాతిశయోక్తి కార
ణ ప్రసక్తిజ కార్యమైనను, విభుండు
చనియెద నఁటన్న మాత్రనే చానకయ్యె
వలయ ముంగరమన్నట్లు వామదేవ. 45

కారణము ప్రసక్తమగుట మాత్రముచేతనే కార్యము జరిగినట్లు తెల్పిన అది చపలాతిశయోక్తి. చపల అన మెఱుపుతీగ. మెరుపుతీగ వలెనే ఇచటి కార్యమును హఠాత్తుగా స్ఫురించును.

నాయకుడు నేను వెళ్ళుచున్నానని చెప్పినమాత్రము చేతనే నాయికకు ఉంగరము కంకణమాయెను. నాయకుని ప్రయాణవార్త వినగానే నాయిక కృశించినది. అవయవములు సన్నమైనవి. కావుననే వ్రేలికి తొడిగెడి ఉంగరము చేతికి కంకణమైనది. ఇంతకును నాయకుడు ఇంకను వెళ్ళనేలేదు. వెళ్ళినతరువాత అతని వియోగముచే కృశించిన అపుడు అవయవములు సన్నపడును. కాని నాయకుడు వెళ్ళుటకు పూర్వమే, వెళ్ళనను వార్త వినినంతనే నాయిక కృశించినట్లు తెలుపబడినది. అనగా కారణ జ్ఞాన మాత్రముననే కార్యము ఉత్పత్తియైనట్లు చెప్పబడినది. నాయకుని ప్రయాణము కారణము, నాయిక సన్నబడుట కార్యము. ఇది చపలాతిశయోక్తి.

38. అత్యంతాతిశయోక్తి స్స్యాత్పౌర్వాపర్య వ్యతిక్రమే।
అగ్రే మానో గతః పశ్చాదనునీతా ప్రియేణ సా॥

క. ప్రియ యత్యంతాతిశయో
క్తి యనన్ మును కార్యముప్పతిలఁ గారణమా
పయి నగుట, యింతి మానము
పయనంబాయెను ప్రియుండు పదపడి ననియెన్. 46

2. అవర్ణ్యములకు మాత్రమే ధర్మైక్యమును నిరూపించిన అది అప్రకృత గోచర తుల్యయోగిత.

'పద్మములును, జారస్త్రీల ముఖములును ముకుళితము లైనవి.'

సూర్యాస్తమయముతో పద్మములు ముకుళితములైనవి. రాత్రిసమయము జారకామినులకు సంతోషసమయము. కాని నిండుపున్నమి యగుటచే పండువెన్నెల వారి స్వేచ్ఛావిహారమునకు ఆటంక మగుటచే జారకామినుల ముఖములందును ముకుళింప బడుటయను ధర్మైక్యము సాధింపబడుటచే నిది ప్రకృతగోచర తుల్యయోగిత.

40. త్వదంగ మార్దవే దృష్టే కస్య చిత్తేన భాసతే।
మాలతీ శశభృల్లేఖా కదళీనాం కఠోరతా॥

గీ. సఖియ! నీమృదు తనుత దృష్టమగునేని
చిత్తమున నెవ్వనికిఁ బ్రకాశింపకుండు
కదళికా మాలతీ లతికా శశాంక
రేఖల కఠోరతయటన్న రీతి శర్వ. 48

ఓ సఖీ! నీ శరీర సౌకుమార్యమును చూచిన ఎవ్వనికి అరటిబోద యొక్కయు, మాలతీలత యొక్కయు, చంద్రికళ యొక్కయు కాఠిన్యము గాడబడకుండును ఇందు వర్ణ్యము ప్రియురాలి అంగమార్దవము: కదళికా, మాలతీలతికా, శశాంకరేఖలు అవర్ణ్యములు వర్ణ్యమైన ప్రియురాలి అంగమార్దవమును నిరూపించుటకు అవర్ణ్యములైన కదళికాదులకు కాఠిన్యమను ధర్మైక్యము వర్ణింపబడినది.

అవర్ణ్యములు అరటిబోద, మాలతీలత, చంద్రరేఖ వర్ణ్యమునకు ఆధిక్యమును కల్పించుటకై అవర్ణ్యముల మూడింటికిని ధర్మైక్యము వర్ణింపబడినది, కావున నిది అప్రకృత గోచర తుల్యయోగిత.

41. హితాహితే వృత్తితౌల్య మపరా తుల్యయోగితా।
ప్రదీయతే పరాభూతి ర్మిత్ర శాత్రవయో స్త్వయా॥

గీ. ఆప్త రిపులందు వృత్తితౌల్యమగునేని
నదియు నొక తుల్యయోగిత యండ్రు కృతుల
రాజ! నీచేత మిత్ర శాత్రవుల కియ్యఁ
బడె నరిష్టంబనినమాడ్కి ఫాలనేత్ర. 49

శత్రులకును, మిత్రులకును సమాన వృత్తినే వర్ణించినయెడల
అదియు తుల్యయోగితయే యగును.

'ఓ రాజా! నీవు శత్రులకు, మిత్రులకు అరిష్టము నిచ్చితివి.'

రిష్టము అనగా కీడు, మేలు. కావున అరిష్టమునకు అరిష్టము
వైభవము అను అర్థములు గ్రహింపవలెను. ఇట రాజు శత్రువులకు
అరిష్టమిచ్చెను. మిత్రులకును అరిష్ట (వైభవ) మిచ్చెను. శత్రువులయందు
మిత్రులయందు సమానముగా వర్తించుటచే నిది తుల్యయోగిత.

42. గుణోత్కృష్టై స్సమీకృత్య వచోఽన్యా తుల్య
యోగితా
లోకపాలో యమః పాశీ శ్రీద శ్శక్రో భవానపి॥

గీ. ప్రాకట గుణాఢ్యతోడ సమీకరించి
కృతి వచించినఁ దుల్యయోగిత యటండ్రు
లోకపాలురు వజ్రి, కాలుండు, వరుణుఁ,
డర్థపతి నీవు నన్నట్లు నలిన నేత్ర! 50

ఉత్తమ గుణములు గలవారలకే సామ్యమును వివక్షించి ప్రతిపా
దించినను అది తుల్యయోగితయే యగును.

వర్షరూపమున వర్షించుచున్నది. నాయక సమాగమము నందలేని నాయికకు ఆ రాత్రి ఒక వర్ష (సంవత్సరము) మగుచున్నది. రెండుచోట్ల పద (వర్ష) మొక్కటే కావున నిది పదావృత్తి దీపకాలంకారము,

45. ఉన్మీలంతి కదంబాని స్ఫుటంతి కుటజోద్గమాః।
మాద్యంతి చాతకా స్తృప్తా మాద్యంతి చ శిఖావళాః॥

క. వికసించెఁ గదంబంబులు
వికచత్వము నొందెఁ గుటజ వృక్షోద్గమముల్
ప్రకట మదము లయ్యెం జా
తకములు శిఖులుం బ్రకట మదములయ్యె నిలన్. 58

'కదంబములు వికసించినవి, కొండమల్లెపూలు విచ్చుకొన్నవి అనుచో వికసించుట, విచ్చుకొనుట అను రెండు క్రియాపదములు ప్రయుక్తమైనను ఆ రెండిటికిని అర్థ మొక్కటే. 'వికసించుట' అను సామాన్యార్థః దీపక మగుటచే నిది అర్థావృత్తి దీపకము.

'తృప్తి చెందిన చాతకములు మదించుచున్నవి. నెమళ్ళును మదించుచున్నవి' అనుచో 'మదించుచున్నవి' అను పదము మరల ఆవృత్తి యగుటచే పదావృత్తి. రెండు పదములకు అర్థము ఒకటే అగుటచే అర్థావృత్తి అగుచున్నది, కావున నిది ఉభయావృత్తి దీపకము

## 17. ప్రతివస్తూపమాలంకారము

46. వాక్యయోరేక సామాన్యే ప్రతివస్తూపమా మతా
తాపేన భ్రాజతే సూరః శూర శ్చాపేన రాజతే॥

క. ఏపారుఁ గృతులఁ బ్రతివ
స్తూపమ వాక్యములు రెంటి కొక సమత తగన్
దాపమున నలరు సూరుఁడు
చాపంబున శూరుఁడొనరు జగతి ననుక్రియన్. 54

రెండు వాక్యములకు ఏకసామ్య ముండిన నది ప్రతివస్తూపమ యగును ఇందు రెండువాక్యములుండును. ఈ రెండువాక్యములకు ఏక ధర్మము భిన్న శబ్దములచే చెప్పబడును. ప్రతివస్తువుతోడి ఉపమ ప్రకటింప బడును గాన నిది ప్రతివస్తూపమాలంకారము.

'సూర్యుడు తాపముచేత భ్రాజిల్లును, శూరుడు చాపముచేత రాజిల్లును.' అనుచో ప్రకశించుట అనునది ఏక సమానధర్మము. అది భిన్న పదములచే ప్రకటింపబడినది కావున నిది ప్రతివస్తూపమాలంకారము

ఇది 'అర్థావృత్తి దీపకాలంకారము కాదా?' అని సందేహము. కాదు అని సమాధానము, ఏలయన ప్రసక్తములైన రెండు విషయములు వర్ణ్యములును, అవర్ణ్యములు నగుట దీపక లక్షణము ఇచ్చట వర్ణ్యమునకు, అవర్ణ్యమునకు పోలిక చెప్పబడుట పరిశీలింపవలెను. దీపకమునందు ధర్మైక్యము ఏకపదముచే ప్రతిపాదింపబడును-ఇందు భిన్నపదములచే ప్రతిపాదింపబడును. ఇదియే ప్రతివస్తూపమ విశిష్టలక్షణము

## 18. దృష్టాంతాలంకారము

47. చేద్బిమ్బ ప్రతిబింబత్వం దృష్టాంత స్తదలంకృతిః,
త్వమేవ కీర్తిమా న్రాజన్ ! విధురేవహి కాంతిమాన్॥

క. కృతి బింబ ప్రతిబింబా
కృతిఁ దగ దృష్టాంత మగును నృప! నీవ సము
న్నతకీర్తి సమన్వితుఁడవు
సితకిరణుఁడు కాంతియుతుఁడు క్షితి ననుపోల్కిన్. 55

వాక్యములకు బింబ, ప్రతిబింబత్వ మున్నచో నది దృష్టాంతాలంకారము. రెండు ధర్మములు పరస్పరము భిన్నములైనను సాదృశ్యము వలన రెండు భిన్నవాక్యములకు సమానధర్మముగా వ్యవహరించుట బింబ ప్రతిబింబ భావము. బింబ ప్రతిబింబ భావమునందు ధర్మము సదృశముగా నుండునుగాని సమానముగా నుండదు. అనగా భిన్న ధర్మములైనను సదృశత్వ కారణమున రెండు భిన్నవాక్యములకును సదృశత్వము లభించుచున్నది. కావున దృష్టాంతాలంకారము.

'ఓ రాజా ! నీవే కీర్తిమంతుడవు. చంద్రుడే కాంతిమంతుడు.'

ఈరెండు వాక్యములకును ఉపమానోపమేయ భావమున్నది. ఇందు కీర్తిమత్త్వము, కాంతిమత్త్వము భిన్న ధర్మములు. ఈ ధర్మములు బింబ ప్రతిబింబ భావముచే సాదృశ్యము సాధించుచుండుటచే నిది దృష్టాంతాలంకారము

## 19. నిదర్శనాలంకారము

48. వాక్యార్థయో స్సదృశయో రైక్యారోపో నిదర్శనా ।
యద్దాతు స్సౌమ్యతా సేయం పూర్ణేందో రకలంకతా॥

గీ. అగు నిదర్శన సదృశ వాక్యార్థములకు
నేకతారోపణ మొనర్చురేని దాత
కెద్ది సౌమ్యత యదియు పూర్ణేందునకును
నిష్కళంకత యన్నట్లు నిఖిల కృతుల. 56

సమానములైన వాక్యార్థముల రెండింటికి ఏకత్వము నారోపణచేసిన అది నిదర్శనాలంకారము. ఇది మూడువిధములు: 1. వాక్యార్థవృత్తి నిదర్శన, 2. పదార్థవృత్తి నిదర్శన, 3. సదసదర్థబోధనరూప నిదర్శన.

'దాతకు సౌమ్యతయే పూర్ణచంద్రునకు అకళంకత' అనుచో దాత యొక్క సౌమ్యతకు, చంద్రుని అకళంకతకు అభేదము చెప్పబడినది. దాతకు సౌమ్యతలేదు, చంద్రునకు అకలంకత లేదని వాక్యార్థములనుబట్టి ఐక్యారోపణము (అదేయిది అని) చేయబడుటచే నిది వాక్యార్థవృత్తి నిదర్శన. దృష్టాంతమునందు ఉపమాలక్షణము, నిదర్శనమునందు రూపక లక్షణము ప్రవర్తిల్లుట గమనార్హము.

49. పదార్థవృత్తి మప్యేకే వదంత్యన్యాం నిదర్శనామ్ ।
త్వన్నేత్రయుగళం ధత్తే లీలాం నీలాంబుజన్మనోః ॥

గీ. ఒక్కటి పదార్థవృత్తి సంయుక్తిఁ దనరు
వేఱొక నిదర్శన యనంగ వినుతికెక్కుఁ
దాలిచెడ నల్లకలువల ఠీవి నీదు
కన్నుదోయి యనంగ లక్ష్యము మహేశ 58

అన్యపదార్థమునందు తదన్యధర్మమును ప్రకటించిన నది పదార్థ వృత్తి నిదర్శన.

'నీ కన్నుదోయి నల్లకలువల ఠీవిని దాల్చుచున్నది.' అనుచో కన్నుదోయియందు, నల్లకలువల ఠీవి ఆరోపింపబడినది. అనగా నల్లకలువలయందున్న శోభనే కనులు ధరించుచున్నవని అభేదము ప్రకటింపబడుటచే నిది పదార్థవృత్తి నిదర్శన.

50. అపరాం బోధనం ప్రాహుః క్రియయాఽసత్స
దర్థయోః ।
నశ్యేద్రాజవిరోధీతి క్షీణం చంద్రోదయే తమః॥

గీ. కీడు మేలు నొండె క్రియచేత బోధింప
నదియు నగు నిదర్శనాఖ్య నొందు
రాజు వైరిచేటు ప్రకటించుఁ జీకటి
చందమామ యుదయమందుఁ జెడుచు. 58

క్రియారూపముచేత కీడుగాని, మేలుగాని బోధింపబడిన నది సదసదర్థ బోధనరూప నిదర్శన యగును. ఆత్మాచరణముచేతనే వర్ణ్యము సదర్థమునుగాని, అసదర్థమునుగాని దృష్టాంతమున బోధించుట జరుగును. అసదర్థము బోధింపబడిన అది అసదర్థబోధనరూప నిదర్శన, సదర్థము బోధింపబడిన అది సదర్థబోధన రూపనిదర్శన.

'చందమామ యుదయమంద రాజవైరి నశించునని జీకటి నశించుచున్నది' రాజవిరోధి యన రాజునకు విరోధియనియు, చంద్రవిరోధి యనియు చెప్పవలెను. రాజు అభ్యుదయముచే రాజవిరోధి నాశనక్రియ జరుగుచున్నది, ఈ నాశనము హితముకాదు అనగా అసదర్థము. కావున నిది అసదర్థబోధనరూపనిదర్శన.

'ఆర్యులు కొండలవలె సమున్నతులు, కాని వారు స్వభావముచే కోమలులు' అనుచో ఆర్యులు ఉపమేయము, కొండలు ఉపమానము. కొండలకు కోమలత్వ ముండదు. ఆ లక్షణము ఆర్యులకున్నది. అనగా ఆర్యులకు (ఉపమేయమునకు) ఆధిక్యము చెప్పబడుటచే నిది వ్యతిరేకాలంకారము. ఇట్లే ఉపమానమునకు విశేషము తెలిపినను అది వ్యతిరేకాలంకారమే.

## 21. సహోక్త్యలంకారము

32. సహోక్తి స్సహభావశ్చే ద్భాసతే జనరంజనః ।
దిగంత మగమ త్తస్య కీర్తిః ప్రత్యర్థిభిస్సహ॥

క. తనరును సహోక్త్యలంకృతి
జనరంజన మగుచుఁ దనర సహభావం బా
తని కీర్తి యాక్రమించెను
ఘన శాత్రవ కోటితోడఁ గకుబంతములన్ 61

ఆహ్లాదజనకముగా సహభావము చెప్పబడిన అది సహోక్త్యలంకారము.

'ఆతని కీర్తి శత్రుసమూహముతో దిగంతముల నావరించెను.' అనుచో అప్రధానవిషయము (శత్రువులు) ప్రధాన విషయము (కీర్తి) నకు సహభావము జనరంజకముగా నభివర్ణింపబడుటచే నిది సహోక్త్యలంకారము.

## 22. వినోక్త్యలంకారము

54. వినోక్తిశ్చేద్వినాకించి త్ప్రస్తుతం హీన ముచ్యతే ।
విద్యా హృద్యాపి సావద్యా వినా వినయసంపదమ్॥

గీ. ఇంచుకగు వస్తువును బాసి హీనముగను
ప్రస్తుతము పల్కఁబడెనేని రహిఁ వినోక్తి
ప్రణుతికెక్కను వినయ సంపదను బాసి
హృద్యయయ్యును విద్య యవిద్యగాదె. 6

వినోక్తి రెండు విధములు. 1. హేయస్వరూప వినోక్తి, 2. రమ్య స్వరూప వినోక్తి.

అల్పమైన వస్తువు లేకపోవుటచే వర్ణ్యమునకు హైన్యమును తెల్పి అది హేయస్వరూప వినోక్తి.

'వినయ సంపదలేని విద్య హృద్యమయ్యును శ్లాఘనీయము కాదు. అనుచో వర్ణ్యము విద్య, అప్రధానమైనది వినయము. ఆ వినయము లేక పోవుటచే విద్యకు హైన్యము చెప్పబడినదిగాన నిది హేయస్వరూప వినోక్తి

55. తచ్చేత్ కించిద్వినా రమ్యం వినోక్తిస్సాపి కథ్యతే ।
వినా ఖలైర్విభాత్యేషా రాజేంద్ర! భవతస్సభా॥

గీ. అల్పవస్తువు బాసి రమ్యమగునేని
నదియును వినోక్తి యనఁగఁ బ్రఖ్యాతికెక్కు
ఖలజనంబులతోఁ బాసి యలరె మిగుల
నీ భవత్సభ ధరణీతలేంద్రవంద్య. 63

అల్పవస్తువును విడుచుటవలన వర్ణ్యమునకు రమ్యత్వము తెలుపబడి నది గాన రమ్యస్వరూప వినోక్తి.

'ఓ రాజా! ఖలుల బాసి యీ నీ సభ ప్రకాశించుచున్నది.' అనుచో వర్ణ్యము సభ. ఖలులు కాకపోవుటవలన వర్ణ్యము (సభ) నకు రమ్యత్వము కలుగుచున్నది కావున నిది రమ్యస్వరూప వినోక్తి.

## 23. సమాసోక్త్యలంకారము

56. సమాసోక్తిః పరిస్ఫూర్తిః ప్రస్తుతేఽప్రస్తుతస్య చేత్।
అయమైంద్రీముఖం పశ్య రక్తశ్చుంబతి చంద్రమాః॥

గీ. ప్రస్తుతంబు వచింప నప్రస్తుతంబు
దోఁచెనేని సమాసోక్తి యేచుఁ గృతుల
ముద్దుఁగొనియెడి నీయైంద్రి ముఖముఁజూడు
రక్తుఁడగుచు నిశీథినీ రమణుఁడనఁగ. 64

ప్రస్తుతము (వర్ణ్యము) తెలిపినపుడు అప్రస్తుతము స్ఫురించినచో అది సమాసోక్త్యలంకారము.

'ఈ ఐంద్రీ (ప్రాచీ) ముఖమును చంద్రుడు రక్తుడగుచు ముద్దుగొను చున్నాడు.' అనుచో చంద్రోదయ వర్ణనము ప్రస్తుతము ఈ వర్ణన వలన ప్రస్తుతాంశ మొకటి మనకు స్ఫురించుచున్నది. చంద్రుడను నాయకుడు ఇంద్రసంబంధమైన పెఱవనితను రక్తుడై ముద్దుగొనెనని తోచుచున్నది. చంద్రోదయము ప్రస్తుతము. నాయకుడు కాముకుడై పరవనితను చుంబించుట అప్రస్తుతము. కావున నిది సమాసోక్తి.

## 24. పరికరాలంకారము

57. అలంకారః పరికరః సాభిప్రాయ విశేషణే।
సుధాంశు కలితోత్తంస స్తాపం హరతు వశ్శివః॥

క. సాభిప్రాయ విశేషణ
మై భాసిల్లినను బరికరాలంకృతి నా
శోభిల్లు, మాకు హిమ ధా
మాభరణుఁడు శివుఁడు తాపమడచు ననుక్రియన్. 65

విశేషణము సాభిప్రాయ మగుచో నది పరికరాలంకారము.

'శీతాంశుని శిరమున దాల్చిన శివుడు మా తాపము నడచుగాక.' అనుచో శీతాంశుని శిరమున దాల్చిన అను విశేషణము సాభిప్రాయము శీతాంశు (చంద్రుని)ని శిరమున దాల్చిన శివుడు తాపమునణచ సమర్థుడను అభిప్రాయము వ్యక్తమగుచున్నది కాన నిది పరికరాలంకారము:

## 25. పరికరాంకురాలంకారము

58. సాభిప్రాయే విశేష్యేతు భవేత్పరికరాంకురః ।
చతుర్ణాం పురుషార్థానాం దాతా దేవ శ్చతుర్భుజః ॥

గీ. అది యభిప్రాయయుత విశేష్యముగఁ జెప్పఁ
బరికరాంకుర మనఁగను బ్రణుతికెక్కు
భువిఁ జతుర్విధ పురుషార్థములకు దాత
దేవుఁడు చతుర్భుజుండను శిఖిఁ గృతుల. 66

విశేష్యము సాభిప్రాయ మగుచో నది పరికరాంకురాలంకారము

'ఈ భువిని చతుర్విధ పురుషార్థములకు దాత దేవుడు చతుర్భుడు.' అనుచో చతుర్భుజునకు నాలుగు హస్తములు కలవనీ, ఆ నాలుగు స్తములతో నాలుగు పురుషార్థములను ఇచ్చుటకు సమర్థుడనీ అభిప్రా

యము. ఆ అభిప్రాయ మంతయు 'చతుర్భుజు' డను విశేష్యమున ఇమిడి యుండుటచే నిది పరికరాంకురము,

## 26. శ్లేషాలంకారము

59\. నానార్థ సంశ్రయః శ్లేషో వర్ణ్యావర్ణ్యోభయాశ్రితః।
సర్వదో మాధవః పాయా త్సయో గంగా మదీధరత్॥

గీ. అర్థములు రెండు ప్రకృతంబు లయ్యెనేనిఁ
దనరు నది ప్రకృత శ్లేషమనఁగఁ గృతులఁ
బ్రకృతమున నప్రకృతము చూపట్టెనేని
నదియ యప్రకృత శ్లేష మగు మహేశ. 67

క. ప్రకృతార్థంబును మఱి య
ప్రకృతార్థముఁ దోఁచెనేని భాసిలుఁ బ్రకృతా
ప్రకృత శ్లేష యనంగను
ముకుటీకృత శిశిరకిరణ మునినుత చరణా. 68

గీ. మమ్ము పుష్కరనేత్రుండు మాధవుండు
భువన రక్షణ చతురాత్మ భుజపటిష్ఠుఁ
డసమ కాణాంతకుఁడు కలాపావతంసుఁ
డగనివాసుఁడు ప్రోవుత ననుదినంబు. 69

అనేక అర్థములు గల శబ్దములు నుపయోగించిన అది శ్లేషాలంకారము.

'రాజు కువలయానందకరుడు' అనుచో రాజు అను శబ్దమునకు చంద్రుడు, రేడు అనియు, కువలయము అను శబ్దమునకు కలువ, భూమి అనియు అర్థములు ఒకటికంటె ఎక్కువ తెలుపబడుటచే నిది శ్లేషాలంకారము.

ఈ శ్లేషము 1. ప్రకృతశ్లేషము, 2. అప్రకృత శ్లేషము, 3. ప్రకృతాప్రకృత శ్లేషము అని మూడు విధములు.

1. శ్లేషచే సిద్ధించు రెండర్థములు ప్రకృతములే అగుచో నది ప్రకృతశ్లేష.
2. రెండర్థములును అప్రకృతములే అగుచో నది అప్రకృత శ్లేష.
3. ఒక అర్థము ప్రకృతము, రెండవది అప్రకృతము అయినచో నది ప్రకృతాప్రకృత శ్లేష.

'పుష్కరనేత్రుడు, భువనరక్షణ చతురాత్మ భుజపటిష్ఠుడు, అసమ బాణాంతకుడు, కలాపావతంసుడు, అగనివాసుడు, మాధవుడు మమ్ము అనుదినంబు బ్రోచుగాత.'

ఇచట విష్ణుపరముగను, శివపరముగను అర్థములు చెప్పబడుచున్నవి.

1. పద్మనేత్రుడు, తన నాలుగు భుజములచే లోకరక్షణ సమర్థుడు. దుష్టుడైన బాణాసురుని అంతకుడు. నెమలి పింఛము శిరోభూషణుడు, శేషశయనుడు, లక్ష్మీభర్త అనుదినము మమ్ము బ్రోచుగాక. విష్ణుపరంగా ప్రకృతము.

2. సర్పములు వస్త్రములుగా గలవాడు, భువనరక్షణ చతురమైన తన భుజముల సామర్థ్యము గలవాడు, అసమ బాణుడైన మన్మథుని అంతకుడు, ఉడుకలాప (నక్షత్ర కళల కధిపతి) చంద్రుడు శిరోభూషణముగా గలవాడు, కైలాస పర్వతమున నివసించువాడు, ఉమా ధవుడు (పార్వతి భర్త) అనుదినము మమ్ము బ్రోచుగాత, ఇది శివపరముగా ప్రకృతం.

విష్ణు శివపరములుగా చెప్పఁబడిన రెండర్థములును ప్రకృతములే యగుటచే నిది ప్రకృత శ్లేష.

60. అబ్జేన త్వన్ముఖం తుల్యం హరిణా హితసక్తినా ।
ఉచ్చరద్భూరికీలాల శ్శుశుభే వాహినీపతిః॥

గీ. అబ్జ సుందరముఖి ప్రవాళాధరోష్ఠి
కాంచనాభాంగి యచలోరు కటియనంగ
నుచ్చలద్భూరికీలాలుఁ డొనరె వాహి
నీశ్వరుండను భంగినిఁ గృతుల శర్వ. 70

రెండర్థములును అప్రకృతములే అయినచో నది అప్రకృత శ్లేష.

'ఆమె అబ్జ సుందరముఖి, ప్రవాళాధరోష్ఠ, కాంచనాభాంగి, అచలోరు కటి' అనుచో ఆమె పద్మమువలె సుందరముఖి, పవడమువంటి అధరోష్ఠ, బంగారు దేహచ్ఛాయ కలది, కొండవలె పెద్ద నితంబము కలది అని ఒక అర్థము.

ఆమె చంద్రునివలె సుందరముఖి, చిగురుటాకువంటి పెదవి కలది, సంపెంగ పరిమళ దేహము కలది, భూచక్రమంత విశాలమైన పిరుదులు కలది అని వేరొక అర్థము. ఇట్టి అబ్జ, ప్రవాళ, కాంచన, అచల శబ్దములు ఉపమానములు అవి శ్లిష్టములు. ఉపమానములు అప్రధానములు కాబట్టి ఆ అర్థద్వయము అప్రకృతమగుచున్నది కావున నిది అప్రకృత శ్లేష.

ఒక అర్థము ప్రకృతము వేరొక అర్థము అప్రకృతము అయినచో నది ప్రకృతాప్రకృత శ్లేష.

'ఉచ్చరద్భూరి కీలాలుడైన వాహినీశ్వరుడు విరాజిల్లెను' అనుచో 'పైకి కారుచున్న విశేష రక్తము కలవాడై సేనాపతి రాజిల్లెను. ఇది ప్రకృతార్థము.

పైకి లేచుచున్న అధిక జలము కలవాడై సముద్రుడు రాజిల్లెను. ఇది అప్రకృతార్థము.

ఇట్లు ఒక అర్థము ప్రకృతము, రెండవ అర్థము అప్రకృతము ప్రకటింప బడుటచే నిది ప్రకృతాప్రకృతశ్లేష.

## 27. అప్రస్తుత ప్రశంసాలంకారము

61. అప్రస్తుత ప్రశంసా స్యాత్సా యత్ర ప్రస్తుతాశ్రయా ।
ఏకః కృతీ శకున్తేషు యోఽన్యం శక్రాన్న యాచతే॥

గీ. ఎచటనేఁ బ్రస్తుతాశ్రయ మేని నదియ
జగతి నప్రస్తుత ప్రశంస యనఁబరఁగు
ఖగ కులమునందు సుకృతి యొక్కటియ యొరుని
వేఁడ దయ్యాది దేవతా విభునిఁ దక్క. 71

ప్రస్తుతము తోచునట్లుగా అప్రస్తుతమును చెప్పినచో అది అప్రస్తుత ప్రశంస. ఇది సమాసోక్తికి విరుద్ధము.

'పక్షులలో నొక్కటియే సుకృతి అది ఇంద్రునికంటె ఒరుని వేడదు.' అనుచో ఇంద్రునివేడు పక్షి చాతకము. చాతకము వర్షముకొఱకు ఎదురుచూచుచుండును. వర్షమునిచ్చునది ఇంద్రుడు అనగా చాతకము ఇంద్రునే యాచించునను అప్రస్తుతాంశముచే అన్యులను యాచింపని అభిమానవంతుడైన పురుషుని ప్రశంస చేయబడుచున్నది. చాతకపక్షి ఎదుట లేకున్నను, దాని వర్ణన ప్రధానము కాకపోయినను దానిని ప్రశం

సించినాడు. ఈ అప్రస్తుత ప్రశంస, ప్రస్తుతమైన అభిమానియైన పురుషుని ప్రశంసయందు పర్యవసించినది కావున నిది అప్రస్తుత ప్రశంస

## 28. ప్రస్తుతాంకురాలంకారము

62. ప్రస్తుతేన ప్రస్తుతస్య ద్యోతనే ప్రస్తుతాంకురః ।
కిం-భృంగ ! సత్యాం మాలత్యాం కేతక్యా కంట
కేద్ధయా॥

గీ. ప్రస్తుతం బగుదానిచేఁ బ్రస్తుతంబు
తనరె నేఁ బ్రస్తుతాంకుర మనఁగఁ బగఁగు
మాలతీలత గలుగంగ మధుప నీకుఁ
గంటక నిషేధ కేతకీ కాంక్షయేల ? 72

ప్రస్తుతమును వర్ణింపగా ఆ ప్రసక్తి ప్రస్తుతమైన వేఱొక వర్ణన మందు పర్యవసించిన నది ప్రస్తుతాంకురము.

'ఓ మధుపమా ! మాలతీలత యుండగ నీకు కంటక నిరోధమగు కేతకీ కాంక్షయేల ?

ఒక ప్రియురాలు ప్రియునితో ననుచున్న మాట లివి. మాలతిని కాదని కేతకి మీద ప్రాలెడు తుమ్మెదను చూచి చెప్పినమాట లగుటచే నిదియు ప్రస్తుతాంకమే.

ఈ మాటల అర్థము 'ఓ ప్రియుడా ! అందుబాటులో నేనుండగా ఆపదల కారణమైన అన్యవనితా సంగమము నేల కోరుచుంటివి?' అని ప్రియురాలు తుమ్మెదను సంబోధించి చెప్పుచున్నది. కావున తుమ్మెద ప్రశంస ప్రస్తుతము, ప్రియుని పరవనితా సంగమ ప్రశంస ప్రస్తుతమే

ఇట్లు ప్రస్తుత ప్రశంసచే మరియొక ప్రస్తుత ప్రశంస తోచుచున్నదిగాన నిది ప్రస్తుతాంకురాలంకారము.

## 29. పర్యాయోక్తాలంకారము

63. పర్యాయోక్తంతు గమ్యస్య వచో భంగ్యన్త
రాశ్రయమ్ ।
నమ స్తస్మై కృతౌ యేన ముధా రాహు వధూ కుచౌ॥

గీ. అమర భంగ్యంతరమున గమ్యార్థ సిద్ధి
యది చెలంగుఁ బర్యాయోక్త మనఁగఁ గృతుల
వందనం బిదె యతని కెవ్వానిచే ము
ధాకృతము లయ్యె రాహు వధూ కుచములు. 73

గమ్యార్థమును భంగ్యంతరముగా వెల్లడించిన నది పర్యాయోక్తాలంకారము. ఇచట ఒక పదముచే చెప్పఁబడవలసినది దాని పర్యాయపదము నాశ్రయించి చెప్పఁబడుటచే నిది పర్యాయోక్తాలంకార మగుచున్నది

'ఎవ్వనిచే రాహు వధూకుచములు వ్యర్థములు కావింపబడినవో వాని కిదే వందనము.'

భర్తృ భోగ్యములుకాని వధూకుచములు వ్యర్థములు రాహువునకు శిరము మాత్రమే మిగులుటచే ఆతని పత్నికి ఆలింగనాది సౌఖ్యములు లేవు. కావున రాహువధూ కుచములు వ్యర్థములు. అట్లు కావించినవాడు అనగా రాహువును శిరము మాత్రమే మిగులునట్లు ఖండించినవాడు విష్ణువు అను అర్థము భంగ్యంతరముగ వ్యంగ్యార్థము స్పష్టమగునట్లు వర్ణింపబడినది గాన నిది పర్యాయోక్తాలంకారము.

64. పర్యాయోక్తం తదప్యాహు ర్యద్వ్యాజే నేష్ట సాధనమ్।
యామి చూతలతాం ద్రష్టుం యువాభ్యా మాస్య
తామిహ॥

గీ. వ్యాజమున నిష్టసాధనం బయ్యెనేని
నదియుఁ బర్యాయోక్తాలంక్రియయ యఁటందు
రిచట మీరిర్వురుండుఁడి యేను మావి
గున్నఁ గనుగొని వచ్చెద నన్నమాడ్కి. 74

'ఏదేని మిషతో తనయొక్కగాని, ఇతరులయొక్కగాని ఇష్టసాధన మగుచో అది పర్యాయోక్తాలంకారము.

'నేను గున్నమావి కనుగొనివచ్చెద, మీరిరువురు నిచట నుండుడు.' అనుచో నాయికా నాయకులకు ఏకాంతమును కల్పించుటకై చెలికత్తె భంగ్యంతరముగా పల్కిన మాటలివి. తానున్నచో వారు క్రీడించుటకు వీలుపడకున్నది గాన వ్యాజమున చెలికత్తె నిష్క్రమించుట ద్వారా ఇ సాధన మగుచున్నది కాన నిది పర్యాయోక్తము.

## 30. వ్యాజస్తుత్యలంకారము

65, ఉక్తి ర్వ్యాజస్తుతి ర్నిందా స్తుతిభ్యాం స్తుతి
నిందయోః
కస్స్వర్ధుని ! వివేక స్తే నయసే పాపినో దివమ్॥

గీ. నిందచే స్తుతి స్తుతిచేత నింద దోఁప
నదియు వ్యాజస్తుతి యనంగ నలరుచుండు
గంగ నీకు వివేకమెక్కడిది ? స్వర్గ
మందఁ జేసెదు పాపాత్ములైన జనుల. 75

నిందచేత స్తుతిగాని, స్తుతిచేత నిందగాని ప్రకట మగునట్లు చెప్పిన అది వ్యాజస్తుత్యలంకారము.

'ఓ గంగా ! పాపాత్ములైన జనులనుగూడ స్వర్గమును జేర్చు నీకు వివేక మెక్కడిది ?' అనుచో గంగ పాపాత్ముల పాపములను పోగొట్టి వారిని స్వర్గమును చేర్చుచున్నదను గంగ ప్రభావమే ఇట కొనియాడ బడినది కాని పైకి నిందవలె కనబడుచున్నది. అనగా నిందయను మిషతో స్తుతి చేయబడినది కాన నిది వ్యాజస్తుత్యలంకారము

66, సాధు దూతి ! పునస్సాధు కర్తవ్యం కిమితః పరమ్।
యన్మదర్థం విలూనాసి దంతైరపి నఖైరపి॥

గీ. మంచిదానవు దూతిక మంచిదాన
వింతకంటెను గర్తవ్యమేమి కలదు
అతని శిత నఖ దంత లూనాంగి వైతి
వెందువలన మదర్థము నందు నహహా ! 76

స్తుతి వ్యాజమున నింద గావించినను అది వ్యాజస్తుత్యలంకారము.

'దూతికా ! నా కొరకు దంత, నఖక్షతమైన అంగములు కలదానవి. ఆహహా ! మంచిదానవు. దూతికా ! మంచిదానవు.

నాయిక తన నాయకుని చెంతకు ఒక దూతికను రాయబార ంపగా ఆ దూతిక తానే నాయికయై నాయకునితో క్రీడించి నఖక్షత, క్షతములతో తిరిగివచ్చినది. అట్టి దూతికతో నాయిక పలికిన పలుకు 'ఆహహా ! దూతికా ! నాకోసం ఎంత కష్టపడ్డావే ? అంగములన్నీ ీయేంత కష్టపడ్డావు.' అని స్తుతిగ పైకి కనబడుచున్నను నిజము ది నిందయే. 'దూతికా ! నిన్ను నా నాయకుని చెంతకు దూతికా నిర్వర్తింప పంప నీవు ధర్మవిరుదముగా ప్రవర్తించి ఆతనితో

క్రీడించి వచ్చితివి. ఛీ' అని నిందించుట తోచుచున్నది. ఇట్లు స్తుతివలన నింద ద్యోతక మగుచుండుటచే నిదియు వ్యాజస్తుత్యలంకారము.

## 31. వ్యాజ నిందాలంకారము

67. నిందాయా నిందయా వ్యక్తి ర్వ్యాజ నిందేతి గీయతే।
విధేః స నింద్యో య స్తే ప్రాగేకమేవాహర చ్ఛిరః॥

గీ. నిందచే నింద విస్ఫూర్తి నెగడెనేని
వ్యాజనింద యనంగఁ బ్రఖ్యాతికెక్కు-
నేమియనవలె విధిని మున్నే కశిరము
నలియఁజేసిన హరు నెన్నవలయుఁ గాక. 77

నిందవలన నింద స్ఫురించినచో అది వ్యాజనిందాలంకారము.

'విధి ననుట యెందులకు? ఒక్క తలనుమాత్రమే త్రుంచిన ననవలయు గాని' అనుచో బ్రహ్మశిరమును ఖండించినందుకు శి॰ నిందింపబడుటలేదు, మిగిలిన నాలుగు శిరములు మిగిల్చినందుకు నిందింపబడుచున్నాడు. నిజమునకు శివుడు అప్పుడే తక్కిన తలలను ఖండించిన యెడల బ్రహ్మయే యుండెడివాడు కాడుకదా అని వక్త అభిప్రాయము.

ఇంతకును వక్త దుఃఖ, నికృష్టమైన బ్రహ్మ సృష్టిని పారమార్థికముగా నిందింపదలచి యున్నాడు. పైకి శివుని నిందించుచున్నట్లు కనబడుచున్నది. నిందచే నింద ప్రకటింపబడుచున్నది గాన నిది వ్యాజనిందాలంకారము.

## 32. ఆక్షేపాలంకారము

68. ఆక్షేప స్స్వయముక్తస్య ప్రతిషేధో విచారణాత్ ।
చంద్ర సందర్శయాత్మాన మథవాస్తి ప్రియాముఖమ్॥

గీ. ఊహ సేయుట వలన నిజోక్తి వాఙ్ని
షేధ మాక్షేప మనఁగను జెలఁగుఁ గృతులఁ
గలువచెలి చూపు నిన్నది గానినాఁడు
నున్నయది ప్రేయసీముఖం బన్నయట్లు. 78

ఆక్షేపాలంకారము మూఁడు భేదములు.

మొదట ఒక విషయమును చెప్పి, ఆలోచించి, మరల దానిని నిషేధించి పలికిన అది ఆక్షేపాలంకారము.

'చంద్రా! నీదర్శనమియ్యి. లేకున్న ప్రియురాలి ముఖమున్నదిలే.' అనుచో మొదట చంద్రదర్శనము తానే కోరి, తరువాత తానే వద్దని నిషేధించెను. మొదట ఆదరించి, తరువాత అనాదరించుటచే ఇది ప్రతిషేధారూపమైన ఆక్షేపాలంకారము.

69. నిషేధాభాస మాక్షేపం బుధాః కేచన మన్వతే ।
నాహం దూతీ తనోస్తాప స్తస్యాః కాలానలోపమః ॥

గీ. బుధజనులు నిషేధాభాసమును వచింతు
రింపు మీఱంగ నాక్షేపమే యఁటంచు
దూతికను గాను కాలాగ్ని తుల్యమగును
దాని తనుతాప మనియెడి దారి శర్వ. 79

నిషేధాభాసము కూడ ఆక్షేపాలంకారము. నిషేధాభాస మనగా నిషేధము వలె అగపడుట.

'దూతికనుకాను. ఆమె తనుతాపము కాలాగ్ని తుల్యముగా నున్నది.' నుచో ఆమె దూతికయై యుండియు దూతికను కాను అని పలుకుట నిషే

ధము. కాని యదార్థముగ దూతికయే కావున ఇది నిషేధాభాసము. ప్రతిపాదిత విషయమునకు ప్రకర్షము సాధించుటకు దూతిక ఇట్లు పలికినది. ఈ నిషేధాభాసముచే నిది ఆక్షేపాలంకారము.

70. ఆక్షేపోఽన్యో విధౌ వ్యక్తే నిషేధే చ తిరోహితే।
గచ్ఛ గచ్ఛసి చేత్కాన్త! తత్రైవ స్యాజ్జనిర్మమ॥

గీ. తనరు చుండంగ విధి, నిషేధము తిరోహి
తముగ వేఱొక యాక్షేపణమగుఁ గృతులఁ
జనుము చనియెదవేని నచ్చటనె నాకు
జనన మయ్యెడుఁ గాంత! యన్ చందమునను. 80

అనభిమతమైన విధిని ప్రకటించి, అభిమతమైన నిషేధమును ప్రకటింపక భంగ్యంతరముగా స్ఫురింప చేసిన నదియును ఆక్షేపాలంకారము

'ప్రియా! వెళ్ళుము. నీవు వెళ్ళిన నేను అక్కడనే జన్మింతును. అనుచో నాయకుడు వెళ్ళుట నాయికకు ఇష్టములేకపోయినను నిషేధమును వ్యక్తముచేయక వెళ్ళుట తన అభీష్టముగా చెప్పబడినది. కాని నిషేధము భంగ్యంతరముగా ప్రకటింపబడినది. 'నే నచ్చటనే జన్మింతును' అనుటలో "నీవు వెళ్ళిన నేను జీవింపను. కావున వెళ్ళకుము" అను భావము నిగూఢముగా నున్నది. ఇష్టములేని వెళ్ళుటను అంగీకరించి, ఇష్టమైన నిషేధమును భంగ్యంతరముగా ప్రకటించుటచే నిది ఆక్షేపాలంకారము.

## 33. విరోధాభాసాలంకారము

71. ఆభాసత్వే విరోధస్య విరోధాభాస ఉచ్యతే।
వినాపి తన్వి! హారేణ వక్షోజౌ తవ హారిణౌ॥

క. తనరు విరోధాభాసం
బనఁ గృతుల విరోధమునకు నాభాసత గ
ల్గిన, హారములను బాసియు
నన్నతోదరి నీ కుచములు హారులుగావే. 81

విరోధమునకు ఆభాసత కలిగిన అది విరోధాభాసము. అనగా పైకి విరోధమున్నట్లు కనబడునేగాని పరిశీలింప విరోధము లేకుండును.

'ఓ తలోదరీ! నీ కుచములు హారముల బాసియు హారులై యున్నవి.' అనుచో హారములున్నప్పుడు మాత్రమే హారులగుచుండ హారములు లేకున్నను హారులనుట విరోధము. హారులనగా "మనోహారులు" అను అర్థాంతర గ్రహణమున విరోధము ఆభాసమగుచున్నది, ఇట్లు విరోధమునకు ఆభాస కలుగుట ప్రకటింపబడుటచే నిది విరోధాభాసాలంకారము.

## 34. విభావనాలంకారము

72. విభావనా వినాపిస్యాత్కారణం కార్యజన్మచేత్ ।
అప్యలాక్షారసాసిక్తం రక్తం త్వచ్చరణద్వయమ్ ॥

గీ. కారణము లేక కార్యంబు గలుగఁ జెప్ప
నది విభావన యనఁగఁ బ్రఖ్యాతి గాంచుఁ
దరుణి లాక్షారసా నిషిక్తములు గాక
యరుణములు నీదు చరణంబు లన్నయట్లు. 82

కారణము లేకుండగనే కార్యము కలిగినట్లు చెప్పబడిన నది విభావనాలంకారము.

'తరుణీ! లాక్షారసముచే తడుపబడకుండగనే నీ చరణములు అరుణములై యున్నవి.' అనుచో

లాక్షారసము పూయుట కారణము, అరుణ మగుట కార్యము. లాక్షారసము పూయకుండగనే అనగా కారణము లేకుండగనే అరుణత్వమందుట యను కార్యము జరిగినట్లు చెప్పబడుటచే నిది విభావన. అనగా ఆమె పాదములు సహజారుణములు అని సిద్ధార్థము.

73. హేతూనా మసమగ్రత్వే కార్యోత్పత్తిశ్చ సా మతా।
అస్త్రైరతీక్ష్ణ కఠినై ర్జగ జ్జయతి మన్మథః॥

ఆ. హేతువులకు బలిమి యెనయకుండినఁ గార్య
మొదవఁ జెప్ప నదియె యొప్పుఁ గృతులఁ
గాయజుం డతీక్ష్ణ కఠినాస్త్రములచేత
గెలుచుచున్న వాఁ డఖిల జగములు. 81

చాలినంత కారణము లేకున్నను కార్యము సాఫల్యమందుటను తెల్పిన అది విభావనాలంకారము.

'తీక్ష్ణములు కాని అస్త్రములచేత మన్మధుడు అఖిల జగములను గెలుచుచున్నాడు.' అనుచో లోకములను గెలుచుటకు తీక్ష్ణములైన అస్త్రములు ఆవసరము అస్త్రములు కారణము, గెలుపు కార్యము. కారణము అసమగ్రముగా నున్నను కార్యము ఫలించునట్లు తెల్పుటచే నిది విభావన.

74. కార్యోత్పత్తి స్తృతీయాస్యా త్సత్యపి ప్రతిబంధకే।
నరేంద్రానేవ తే రాజన్! దశత్యసి భుజంగమః॥

గీ. కార్యమొదవినఁ బ్రతిబంధకంబు గలుగ
నది తృతీయ విభావన యండ్రు కృతుల
దొరల తల మానికమ! నరేంద్రులనె కఱచు
చున్న యది యుష్మదీయ ఖడ్గోరగంబు. 84

కార్యమునకు ప్రతిబంధక మున్నప్పటికిని కార్యసాఫల్యము కలిగిన నదియును విభావనాలంకారము.

'ఓ రాజశ్రేష్ఠా! నీ ఖడ్గోరగము నరేంద్రులనే కఱచుచున్నది.' అనుచో నరేంద్రులన రాజులనియే కాక పాములవాండ్రనియు అర్థము' పాము కాటునకు మంత్ర, ఔషధాదులు ప్రతిబంధకము. అట్టి ప్రతిబంధక మున్నను ఖడ్గోరగము నరేంద్రులనే కాటువేయుచున్నది అని తెల్పిన ఇది విభావనాలంకారము.

75. అకారణా త్కార్యజన్మ చతుర్థీ స్యా ద్విభావనా ।
శంఖా ద్వీణా నినాదోఽయ ముదేతి మహదద్భుతమ్॥

గీ. కార్యమొదవిన యెడల నకారణమున
నాల్గవ విభావన యనం దనర్చుఁ గృతుల
గలిత వీణారవంబు శంఖంబు వలన
జనన మందెడి నిది వింత యను విధమున. 85

కారణము కానిదానిచే కార్యము ఫలించినట్లు తెల్పిన నదియు విభావనాలంకారము.

'వీణారవము శంఖమునుండి జనన మందుచున్నది ఇది వింత!' అనుచో వీణారవమునకు శంఖము కారణము, వీణారవమునకు, శంఖ

మునకు సంబంధము లేనేలేదు. శంఖమునుండి శంఖారవము జనించును గాని వీణారవ మెట్లు? అకారణమైన శంఖమునుండి వీణానాద ముద్భవించె నని తెల్పుటచే నిది విభావనాలంకారము.

ఈ అసంబద్ధమును సమర్థించుటకు శంఖ మనగా స్త్రీ కంఠమనియు, వీణారవ మనగా ఆ స్త్రీయొక్క కంఠస్వరమనియు గ్రహింపవలెను. అతివ కంఠమునుండి కోమల స్వరము పుట్టెనని యర్థము.

76. విరుద్ధా త్కార్య నిష్పత్తి ర్దృష్టా కాచిద్విభావనా ।
శీతాంశు కిరణా స్తన్వీం హంత! సంతాపయంతి తామ్॥

గీ. అతివిరుద్ధము వలనఁ గార్యంబు గలుగ
నదియు నొక్క విభావన యనఁగఁ దనరుఁ
దాపమందఁగఁ జేసెడి తన్వి నహహ
శీతలాంశుని కరములన్ రీతి శర్వ. 8

విరుద్ధమైన కారణమునుండి కార్య ముత్పన్నమైనట్లు తెల్పిన నదియు విభావనాలంకారము

'శీతలాంశుని కరములు (చంద్రకిరణములు) ఆ తన్విని తాపమంద జేయుచున్నవి.' శీతలకిరణము లగుటచే తాపమును కలిగింప సమర్థములు కావు. విరుద్ధమైన దానిచే కార్యము కలిగినట్లు చెప్పబడినది గాన నిది విభావనాలంకారము.

ఈ విరుద్ధమునకు తాత్పర్యముగా మలయానిలము, కీర శారికా గానములు, చంద్రకిరణములు విరహావస్థలో నున్నవారికి దాపము కలుగ జేయును అని చెప్పుట సమయము.

77\. కార్యాత్కారణ జన్మాపి దృష్టా కాచిద్విభావనా।
యశః పయోరాశి రభూత్ కరకల్పతరో స్తవ॥

గీ. కారణము కార్యము వలనఁ గలిగెనేని
వేఱొక విభావన యటండ్రు విబుధవరులు
నీకరంబను కల్పకా నోకహంబు
వలనఁబుట్టె మహాకీర్తి వారిరాశి 87

కార్యమునుండియే కారణము పుట్టిన ఆదియు విభావనాలంకారము.

'ఓ రాజా! నీ కరమనెడి కల్పవృక్షమునుండి నీ కీర్తి యనెడి పాలసముద్రము పుట్టెను.' అనగా పాలసముద్రము కారణము, కల్ప వృక్షము కార్యము. పాలసముద్రమునుండి కల్పవృక్షము పుట్టుట యదార్థము. ఇచట కరము కల్పవృక్షము, కీర్తి పాలసముద్రము అని అభేదము చెప్పబడినది. కరము వలన అనగా దాతృత్వము వలన కీర్తి యనెడు పాలసముద్రము కలిగెను. కరము కారణము, కీర్తి కార్యము. కారణ కార్యములకు వ్యత్యయము కలుగుచుండుటచే నిది విభావనాలంకారము

## 35. విశేషోక్త్యలంకారము

78\. కార్యాజని ర్విశేషోక్తి స్సతి పుష్కలకారణే।
హృది స్నేహక్షయో నాభూత్ స్మరదీపే జ్వలత్యపి॥

గీ. కారణము పుష్కలంబుగాఁ గలుగు కార్య
ముద్భవింపమి యగు విశేషోక్తి యనఁగ
అహహా! స్నేహక్షయంబు గాదయ్యె మదిని
విపుల మన్మథ దీపంబు వెలుఁగుచుండ. 88

కారణము పుష్కలముగా నున్నను కార్యము కలుగలేదని తెల్పిన నది విశేషోక్త్యలంకారము.

'మన్మథ దీపము వెలుగుచున్నప్పటికిని స్నేహక్షయము కాలేదు.' స్నేహమన ఇట చమురు అని అర్థము. దీపము వెలుగుచుండగ చమురు తరుగుచుండవలెను. దీపము వెలుగుచుండుట కారణము, చమురు తరుగుచుండుట కార్యము. దీపము వెలుగుచుండినను స్నేహక్షయము కాలేదనిన కారణము పుష్కలముగా నుండినను కార్యము జరుగుట లేదు కావున నిది విశేషోక్త్యలంకారము.

ఇది యెట్లు ? అనిన స్నేహమన మైత్రి, ప్రేమ అని అర్థము చెప్పిన, ప్రేమ తగ్గలేదని యర్థము చెప్పుకొనవలెను.

## 36. అసంభవాలంకారము

79. అసంభవోఽర్థ నిష్పత్తే రసంభావ్యత్వ వర్ణనమ్ ।
కోవేద గోపశిశుక శ్శైల ముత్పాటయే దితి॥

గీ. అర్థనిష్పత్త్యసంభావ్యతాను వర్ణ
నం బసంభవ మనఁగఁ దనర్చుఁ గృతులఁ
గోప బాలుఁడు దానిట్లు కొండయెత్తఁ
గలఁడనుచు నెవ్వఁడెఱుఁగు నన్కరణి శర్వ.

అర్థసిద్ధికి అసంభావ్యత్వము తెలుపబడిన నది అసంభవాలంకారమ

'గోపబాలు డిట్లు కొండ యెత్తగలడని ఎవ్వడెఱుగు.' నన్నచ గోపబాలుడు కొండనెత్తుట అర్థసిద్ధి. బాలుడు కొండనెత్తుట అసంభవము

అందులకే ఎవ్వ నెఱుగును? ఇట్లు అర్థసిద్ధికి అసంభావ్యత్వము అనుట కూర్చబడినది గాన నిది అసంభావాలంకారము.

## 37. అసంగత్యలంకారము

80. విరుద్ధం భిన్నదేశత్వం కార్యహేత్వో రసంగతిః।
విషం జలధరైః పీతం మూర్ఛితాః పథికాంగనాః॥

గీ. అవు నసంగతి కార్యహేతువుల కతి వి
రుద్ధతయు భిన్నదేశత యూథమైన
ఘనధరమ్ములు విషము ద్రావంగఁ బథిక
కామినులు మూర్ఛ చెందిరన్ కరణి శర్వ. 90

కార్య కారణములకు విరుద్ధత, భిన్నదేశత నిరూపింపబడిన నది అసంగత్యలంకారము,

'మేఘములు విషము ద్రాఁగ కామినులు మూర్ఛ చెందిరి.' అనుచో మేఘములు విషము త్రాగుట కారణము, కామినులు మూర్ఛిల్లుట కార్యము. కాని విషపానము జరిగిన దొకచోట, మూర్ఛవచ్చిన దొకచోట. అనగా కార్య కారణములకు భిన్నదేశత, విరుద్ధత చెప్పబడుటచే నిది అసంగత్యలంకారము. ఇంతకును వర్షాగమనమున పాంథస్త్రీలు మోహమును పొందిరని దీని యర్థము.

81. అన్యత్ర కరణీయస్య తతోఽన్యత్ర కృతిశ్చ సా
అపారిజాతాం వసుధాం చికీర్షన్ ద్యాం తథాకరోః॥

ఆ. అగు నసంగతి యనునది యొక్కచోఁ జికీ
ర్షితము నితరమునకుఁ జేసెనేని
క్షితి నపారిజాతఁ జేయంగఁ బూని స్వ
ర్గము నపారిజాతము సలిపితి. 91

ఒకచోట చేయవలసిన పనిని వేరొకచోట చేసిన నదియు అసంగత్యలంకారము.

'భూమండలము నపారిజాతము చేయగోరి స్వర్గము నపారిజాతము కావించితివి' అనుచో భూలోకమున చేయవలసిన పనిని స్వర్గలోకమున చేసెను. కావున నిదియు అసంగత్యలంకారము.

అపారిజాతము అనగా (అప + అరి + జాతము) శత్రుసమూహము లేనిది అని భూమిపరముగా అర్థము. (న + పారిజాతము) పారిజాతము లేనిది అని స్వర్గపరముగా అర్థము తెల్పిన అర్థము సంగతము.

82. అన్యత్కర్తుం ప్రవృత్తస్య తద్విరుద్ధ కృతిశ్చ సా ।
గోత్రోద్ధార ప్రవృత్తోఽపి గోత్రోద్భేదం పురా కరోః॥

గీ. ఒకటి సేయంగఁ బూని దానికి విరోధ
కరము నొనరించుటయు నసంగతి యనఁబడు
నతఁడు గోత్రోద్ధరణము సేయంగఁ బూని
సలిపె గోత్రోద్దలనమని పలుకునపుడు. 92

ఒక పనిని చేయబూని దానికి విరుద్ధమయిన పనిని చేసిన నదియు సంఅగత్యలంకారము.

'ఆతడు గోత్రోద్ధరణము చేయబూని గోత్రోన్మూలనము చేసెను' అనుచో చేయదలచినది ఉద్ధరణము, జరిగినది ఉన్మూలనము. రక్షణము చేయబోయి నాశనము చేయుటచే విరుద్ధకార్యము జరిగినది కావున ని ఆసంగత్యలంకారము,

గోత్రము అనగా భూమి, పర్వతము, వంశము అని అర్థము. కృష్ణుడు భూమి నుద్ధరింపగోరి భూమిని పెళ్ళగించెను యాదవుల రక్షణకై గోవర్ధనమెత్తెను.

## ౩౮. విషమాలంకారము

౮౩. విషమం వర్ణ్యతే యత్ర ఘటనాననురూపయోః ।
క్వేయం శిరీష మృద్వంగీ క్వతాదృఙ్మదనజ్వరః ॥

గీ. తగని వస్తుద్వయంబు సందర్భ మెచట
నైనఁ వర్ణింపఁబడె నేని నదియ విషమ
మనఁగఁ దగు నీ శిరీషమృద్వంగి యేడ
నిట్టి చేతోభవ జ్వరం బేడ ననఁగ. ౮౩

అననురూపములైన వానికి ఘటన వర్ణింపబడిన నది విషమాలంకారము.

'నీ శిరీష మృదుల శరీర మెక్కడ? మన్మధకృత తాపమెక్కడ?' అనుచో సుకుమారి యగు అంగనకు దుస్సహమగు మదన జ్వరమునకు ఘటన వర్ణింపబడినది. ఈ అననురూపముల ఘటనచే నిది విషమాలంకారము.

84. విరూప కార్యస్యోత్పత్తి రపరం విషమం మతమ్ ।
కీర్తిం ప్రసూతే ధవళాం శ్యామా తవ కృపాణికా॥

గీ. అగు విరూప కార్యోత్పత్తి యయ్యెనేని
నపర విషమంబు ధరణీశ్వరావతంస
ధవళకీర్తిని నీ నెడఁ దావకీన
మేచక కృపాణి యన్నట్లు మృగధరాంక. 94

విరూప కార్యోత్పత్తి తెల్పినను విషమాలంకారము. విరూప కార్యమన కారణమునకు విరుద్ధమైన కార్యము.

'నీ నల్లని కత్తి తెల్లని కీర్తి నీను చున్నది.' అనుచో నల్లని కత్తి-నల్లని కీర్తి అనిన విరూప కార్యోత్పత్తి లేదు. నల్లని కత్తి - తెల్లని కీర్తి అనుటచే విరూప కార్యోత్పత్తి, నలుపు వలన తద్విరుద్ధమైన తెలుపు పుట్టిన దనుటచే నిది విషమాలంకారము.

85. అనిష్టస్యాప్య వాప్తిశ్చ తదిష్టార్థ సముద్యమాత్ ।
భక్ష్యాశయా హి మంజూషాం దష్ట్వాఖు స్తేన
భక్షితః॥

గీ. ఇష్ట సంసిద్ధిఁగోర నరిష్టసిద్ధి
యయ్యెనే న్విషమూహ్వయం బనఁగఁ బరఁగుఁ
గొఱుకు భక్ష్యాశ ఫణి పేటిఁ గొఱికి దాని
చేత భుజియింపఁబడినట్లు శేషభూష. 95

ఇష్టసిద్ధినిగోరి ప్రయత్నింప ఇష్టసిద్ధి లభింపక అనిష్టసిద్ధి యయినచో నదియు విషమాలంకారము.

'ఎలుక భక్ష్యముపై ఆశతో పాముపెట్టెను కొఱికి దానిచేత భుజింపబడెను' అనుచో ఎలుక ఇష్టసిద్ధి ఆహారము. అది లభింపలేదు సరికదా అనిష్టసిద్ధి ప్రాణములు పోయినవి. కావున నిది విషమాలంకారము.

## 39. సమాలంకారము

86\. సమం స్యాద్వర్ణనం యత్ర ద్వయో రప్యను
రూపయోః ।
స్వానురూపం కృతం పద్మ హారేణ కుచమండలమ్॥

గీ. పొగడఁబడె నేస్థలంబునఁ దగిన వస్తు
యుగ మది సమం బనంగను నెగడుఁ గృతుల
నవుల హారంబుచేత నాత్మానురూప
మందిరము సేయఁబడెఁ గుచమండలంబు.

అనురూపములైన వానికి ఘటన వర్ణింపబడిన నది సమాలంకారము. అననురూపములైనవాని ఘటన విషమము, అనురూపములైనవాని ఘటన సమము

'హారముచేత కుచమండలము ఆత్మానురూప మందిరము సేయఁబడెను.' అనుచో హారము, కుచమండలము అనురూపములు. (ఒకదానికొకటి తగినవి) హారము శోభకు, కుచమండల శోభకు సరిపోవుచున్నది. వాని ఘటన వర్ణింపబడుటచే నిది సమాలంకారము

87\. సారూప్యమపి కార్యస్య కారణేన సమం విదుః ।
నీచ ప్రవణతా లక్ష్మి ! జలజాయా స్తవోచితా॥

ఆ. కారణంబుతోడఁ గార్యమునకు సరూ
పత లభింపఁ జెప్పఁబరఁగు సమము
నీరజాత వగుట నీచప్రవణత నీ
కుచితమౌను గద పయోజసదన. 97

కారణముతో కార్యమునకు సామీప్యము చెప్పబడిన నదియు సమాలంకారము. ఇది విషమాలంకారములోని రెండవ భేదమునకు వ్యతిరేకము. విరూప కార్యోత్పత్తి విషమము. కార్యకారణ సారూప్యము సమాలంకారము.

'ఓ లక్ష్మీదేవీ! నీటిలో పుట్టిన నీకు నీచప్రవణత ఉచితమే కదా! అనుచో (నీచప్రవణత యన పల్లమునకు ప్రవహించుట యని నీటిపరముగా యర్థము, నీచులయొద్దనే యుండుట యని లక్ష్మిపరముగా యర్థము) నీటిలో పుట్టితివి గావున ఆ లక్షణమే నీకును వచ్చినది, లక్ష్మి నీచుల యొద్దనే యుండుననుట భావము కారణము నీచవంశ జననము, కార్యము నీచప్రవణత. రెండింటికి సరిపోయి కార్య కారణములకు సారూప్యమ చెప్పబడుటచే నిది సమాలంకారము

88. వినా నిష్టం చ తత్సిద్ధి ర్యదర్థం కర్తురుద్యమః ।
యుక్తో వారణ లాభోఽయం స్యాల ! తే వారణార్థినః॥

ఆ. ఇష్టసిద్ధి యగుట నిష్టంబు లేకుండ
యదియు సమ విభేదమందు్రి బుధులు
వారణంబు గోరువాని కర్థ్యముగాదె
ద్వారమందుఁ గలిగె వారణంబు 98

'అనిష్టము లేకుండ నిష్టసిద్ధి కలిగిన నదియు సమాలంకారము.' ఇది విషమాలంకారమున మూడవ భేదమునకు వ్యతిరేకము. ఇష్టము కోర అనిష్టము కలుగుట విషమాలంకారము. అనిష్టము లేకుండ ఇష్టసిద్ధి కలుగుట సమాలంకారము.

'వారణము కోరువానికి ద్వారమందే వారణ లాభము కలిగెను. ఆర్హ మేకదా!' అనుచో వారణము అనగా ఏనుగు అనియు, అడ్డగింప బడుట యనియు అర్థము. ఏనుగును కోరి రాజద్వారము ప్రవేశింప గోరిన వానిని ద్వారముచెంతనే భటులు నిరోధించిరి. కోరినది లభింపలేదు కాని ఇట కోరి నది వారణము సిద్ధించినది. వారణము శబ్దాశ్రయ సిద్ధి లభించినది కావున సమాలంకారము

## 40. చిత్రాలంకారము

89. చిత్రం తత్ర ప్రయత్నశ్చేద్విపరీత ఫలేప్సయా ।
నమన్తి సన్త స్త్రైలోక్యాదపి లబ్ధుం సమున్నతిమ్॥

గీ. క్షితిని విపరీత ఫలవాంఛచేతఁ దత్ప్ర
యత్నమగునేని నది చిత్రమనఁగఁ బరఁగు
నమ్రులై యుండెదరు సజ్జనంబు లెల్ల
ముజ్జగంబుల కంటె సమున్నతిఁ గన. 99

విపరీత ఫలవాంఛచేత దాని కనకూల ప్రయత్నము కాక విరుద్ధ ప్రయత్నము జరిగిన నది చిత్రాలంకారము.

'ముల్లోకములకన్న సమున్నతిని గోరి సజ్జను లెల్లరు నమ్రులై యుండెదరు.' యిట కోరినది ఉన్నతి, ప్రయత్నము నమ్రిత ప్రయత్నమునకు విరుద్ధమైన ఫలము కావున నిది చిత్రాలంకారము.

## 41. అధికాలంకారము

90\. అధికం పృథులాధారా దాధేయాధిక్య వర్ణనమ్ ।
బ్రహ్మాండాని జలే యత్ర తత్ర మాన్తి నతే గుణాః॥

గీ. తోరమైన యాధార వస్తువులకంటె
ఘనత యాధేయమునకుఁ గూర్చిన నధికము
నలువ యెయ్యెడనో నీట మునుఁగు నచట
మునుఁగఁ బడవు భవద్గుణంబులను కరణి. 100

గొప్పదైన ఆధారముకంటే ఆధేయమునకు అధిక్యమును వర్ణించిన నది అధికాలంకారము.

'ఏ నీట బ్రహ్మాండములు మునుగుచున్నవో ఆ నీట భవద్గుణంబులు మునుగఁబడవు.' ఇట జలము ఆధారము. గుణములు ఆధేయము. విశాలమైన జలమునందు బ్రహ్మాండములు ఇమిడినవి కాని నీగుణములు ఇముడవనుటచే ఆధారమునకంటె ఆధేయమునకు అధిక్యము చెప్పబడినది. కావున నిది అధికాలంకారము.

91\. పృథ్వాధేయా ద్యదాధా రాధిక్యం తదపి తన్మతమ్
కియద్వాగ్బ్రహ్మ యత్రైతే విశ్రామ్యంతి
గుణాస్తవ॥

గీ. ఎంత పెద్దది యాధేయ మంతకంటె
నధిక మాధారమగుటయు నధికమయ్యె
నెంత పెద్దదో వాగ్బ్రహ్మ మెన్నరాని
నీ గుణంబులు దనలోన నింపె నవఁగ. 101

ఆధేయమే పెద్దదిగా చెప్పి ఆధారము అంతకంటెను పెద్దది అని తెల్పిన అడియును అధికాలంకారము.

'వాగ్బ్రహ్మ మెంతగొప్పదో! ఎన్నరాని నీ గుణములు తనలో నింపెను' ఆతని గుణములు అనంతములు. జలములే ఆ గుణముల నిముడ్చు కొనలేక పోయినవి. అట్టి అధికత్వముకల గుణములను వాగ్బ్రహ్మము తనలో నిముడ్చుకొనుచున్నది. ఇచట గుణములు ఆధేయము, వాగ్బ్రహ్మ మాధారము. ఆదారము అధిక తరముగా వర్ణింప బడుటచే నిది అధికాలంకారము.

## 42. అల్పాలంకారము

92. అల్పంతు సూక్ష్మా దాధేయా ద్యదాధారస్య సూక్ష్మతా।
మణిమాలోర్మికా తేఽద్య కరే జపవటాయతే॥

గీ. అలంతి యాధేయమునకంటె నల్ప భావ
మధిక మాధారమున కది యల్పమగును
ఇపుడు నీకేల నూర్మిక జపవటాయ
మానమగు చున్నయది యనుమాడ్కి శర్వ. 102

ఆధేయము అల్పము. అధారముయొక్క అల్పభావము అంతకంటెను అధికము అని తెల్పిన నది అల్పాలంకారము.

'ఇపుడు ఉంగరము నీచేతి జపమాలవలె నున్నది.' చేయి ఆధారము, ఉంగరము ఆధేయము. ఉంగరము చాల చిన్నది. అది చేతికి పట్టదు. కాని అది జపమాల కూడ అయినది. అనగా చేయి అంత సూక్ష్మమైనది. ఇట్లు ఆధేయము (ఉంగరము) కంటె ఆధారము (చేయి) సూక్ష్మముగా చెప్ప బడుటచే నిది అల్పాలంకారము.

## 43. అన్యోన్యాలంకారము

93. అన్యోన్యం నామ యత్రస్యా దుపకారః పరస్పరమ్ ।
త్రియామా శశినా భాతి శశీ భాతి త్రియామయా॥

గీ. భ్రాజిలుఁ బరస్పరోపకారముగఁ జెప్ప
నది కృతులయందు నన్యోన్యమనెడు పేర
రాత్రి శశిచేఁ బ్రకాశించు రాత్రిచేత
శశి ప్రకాశించు నన్నట్టి చందమునను. 103

పరస్పరోపకారము పొందుచున్నట్లు చెప్పబడిన నది అన్యోన్యాలంకారము. దీనిచేత అది, దానిచేత నిది ఉపకారము పొందుచున్నట్లు వర్ణింపబడుట.

'రాత్రి చంద్రునిచేత ప్రకాశించును. రాత్రిచేత చంద్రుడు ప్రకాశించును' పరస్పరము ప్రయోజకము నొందుచుండుటచే నిది అన్యోన్యాలంకారము.

## 44. విశేషాలంకారము

94. విశేషః ఖ్యాత మాధారం వినాప్యాధేయ వర్ణనమ్ ।
గతేఽపి సూర్యే దీపస్థా స్తమశ్ఛిన్దంతి తత్కరాః॥

గీ. తనరును విశేష మాధారమునను బాసి
నపుడు నాధేయ వర్ణన మయ్యెనేని
నర్కుఁ డరుగ దీపస్థము లగుచుఁ దత్క
రము లిరుల్ద్రుంచెడి ననంగ రాజముకుట. 104

గీ. అల్పయత్నము చేత శక్యంబుగాని
యన్య వస్తువు సమకూర్ప నదియె యగును
నిన్నుఁ గనుఁగొను నాచేత నేఁడు లబ్ధ
మయ్యెఁ గల్పద్రుమేక్షణం బన్నయట్లు. 106

అల్ప ప్రయత్నము చేతనే అశక్యమైన అన్యవస్తువు సమకూరినట్లు తెల్పిన నదియు విశేషాలంకారము.

'నిన్ను చూచుచున్న నాకు నేడు కల్పవృక్ష నిరీక్షణము లబ్ధమయినది.' ఇచట రాజును చూచుట అల్ప ప్రయత్నము. కల్పవృక్ష నిరీక్షణము అశక్యము అది సమకూరినట్లు తెల్పుటచే నిది విశేషాలంకారము. కల్పవృక్ష దర్శనము కోరిక లీడేర్చునట్లు రాజదర్శనము తన వాంఛితము లీడేర్చునని అర్థి భావము స్పష్టము.

## 45. వ్యాఘాతాలంకారము

97. స్యా ద్వ్యాఘాతోఽన్యథాకారి తథాకారి క్రియేతచేత్ ।
యై ర్జగత్ప్రీయతే హంతి తై రేవ కుసుమాయుధః॥

గీ, ఒక్క విధమైన దాని వే ఱొక్క పనికి
సర్వముగఁ జేయ వ్యాఘాతమంద్రు దాని
నెవ్వి జగమున కింపగు నవ్వి హింస
సలుప కరణములుగఁ బంచశరుఁ డొనర్చె. 107

ఒక విధమైన వస్తువును తద్విరుద్ధమైన వేఱొక పనికి సాధనముగ చేసి పల్కిన నది వ్యాఘాతాలంకారము.

'ఏవి జగమునకు ఇంపగునో వానినే మన్మథుడు హింస సలుపుటకు కరములుగ నొనర్చెను.'

పుష్పములచేత జగత్తు ఆనందము నొందుచున్నది. వానిచేతనే మన్మథుడు కాముకులను హింసించుచున్నాడు. ఆనందమునకు కారణము లైన పుష్పములు హింసకు సాధనములుగా చెప్పబడుటచే నిది వ్యాఘాతాలంకారము.

98. సౌకర్యేణ నిబద్ధాపి క్రియా కార్య విరోధినీ ।
దయా చేద్బాల ఇతి మయ్యపరిత్యాజ్య ఏవతే॥

గీ. అభిమత విమిత్త మని పల్కినదె విరుద్ధ
మైన నదియును వ్యాఘాత మండ్రు బుధులు
నేను బాలుఁడ నని దయ నీకుఁ గలిగె
నేని నను విడనాడుట యెట్లు గూడు. 108

కార్యాపేక్షతో చేయబడిన పని దానికి విరుద్ధముగానై కార్యవిఘాతము కలిగించిన నదియు విఘాతాలంకారము

'నేను బాలుడనని నీకు దయయున్న నన్ను విడనాడుట ఎట్లు న్యాయము?' పసివాడవు గాన నీవు ఇచటనే యుండుమని పలికిన రాజునకు యువరాజు పసివారిని ఒంటరిగా విడచుట న్యాయముగాదని పలుకుటద్వారా తద్విరుద్ధముగా వర్తించుటచే కార్యసాఫల్యమునకు పల్కినమాట కార్య విఘాతము కలిగించినది కావున నిది వ్యాఘాతాలంకారము.

## 46. కారణమాలాలంకారము

99. గుంభః కారణమాలా స్యాద్యథా ప్రాక్ప్రాంత
కారణైః ।
నయేన శ్రీః శ్రియా త్యాగ స్త్యాగేన విపులం యశః॥

గీ. వరుస దప్పని కారణావళులతోడఁ
గీలు కొల్పినఁ గారణమాల యగును
నీతిచే సిరి సిరి చేత దాతృతయును
దాతృతను భూరి యశ మన్నరీతి శర్వ. 109

పూర్వపూర్వ వస్తువులు ఉత్తరోత్తరములకు కారణభూతములగుట కాని, ఉత్తరోత్తర వస్తువులు పూర్వ పూర్వములకు కారణభూతములగు గాని వరుసగా మాలలోని పుష్పములవలె చెప్పబడిన నది కారణమాలాలంకారము.

నీతిచే సంపద, సంపదచేత దాతృత్వము, దాతృత్వమున భూరి యశము కలుగును.

ఇందు నీతి సంపదకు, సంపద దాతృత్వమునకు, దాతృత్వము యశమునకు కారణభూతము లైనవి. ఇట్లు పూర్వపూర్వ వస్తువులు ఉత్తరోత్తరములకు కారణభూతములగుటచే నిది కారణమాలాలంకారము

100. భవంతి నరకాః పాపా త్పాపం దారిద్ర్య సంభవం ।
దారిద్ర్య మప్రదానేన తస్మా ద్దానపరో భవ॥

గీ. నరకములు పాపమునఁ జే
    కుఱుఁ బాపము లేమిచే నగును లేమి పతి
    స్ఫురణం బీకుండుటచేఁ
    బరఁగు నటులుగాన దానపరుఁడవు గమ్మా. 110

'నరకములు పాపముచేత, పాపము లేమిచేత, లేమి దానమీయ కుండుటచేత వచ్చును కావున దానపరుడవు కమ్ము'

ఇందు పాపము నరకమునకును, లేమి పాపమునకును, అప్రదానము లేమికిని కారణములుగా చెప్పబడినవి. ఇట్లు ఉత్తరోత్తర వస్తువులు పూర్వ పూర్వములకు కారణ భూతములుగా వర్ణింపబడుటచే నిది కారణ మాలాలంకారము,

## 47. ఏకావళ్యలంకారము

౹౹. గృహీత ముక్తరీత్యార్థ శ్రేణి రేకావళీ మతా ।
వేత్రే కర్ణాంత విశ్రాంతే కరా దోస్తంభ దోలినౌ॥

౹౾. దోస్తంభౌ జాను పర్యంత ప్రలంబన మనోహరౌ ।
జానునీ రత్న ముకురాకారే తస్య మహీభుజః॥

అలరును గృహీత ముక్తరీత్యర్థ పంక్తి
యగుచు నేకావళి యనంగ నఖిలకృతుల
దీనికి వచింతు లక్ష్యంబు దెలియ వినుము
శైలజానాథ ! ప్రమథ సంచయ సనాథ ! 111

గీ. కన్ను లాశ్రవణాంత దీర్ఘములు శ్రవణ
ములు భుజనికాయ భావితంబులు భుజములు
జాను లంబముల్ జానువు ల్చారు ముకుర
సదృశములు చోళ వసుమతీశ్వరున కనఁగ. 112

మాలాభేదమే ఏకావళి. గృహీత ముక్తరీతిచే కూర్పబడిన అర్థపంక్తి ఏకావళ్యలంకారము అగును.

గృహీత ముక్తరీతి యన గ్రహించిన దానిని విడిచిపెట్టి వేఱొక దానిని గ్రహించుట మరల దాని విడుచు పద్ధతి. ఇచట విశేష్య విశేషణ సంబంధ ముండును.

'చోళ మహారాజునకు కన్నులు ఆశ్రవణాంత దీర్ఘములు; శ్రవణములు బాహుపర్యంత లంబమానములు, బాహువులు జానుపర్యంత దీర్ఘములు, జానువులు మనోహర ముకుర సదృశములు.' అనుచో మొదటి కన్నులు గ్రహింపబడి విడిచిపెట్టబడినవి. అటులనే శ్రవణములు, బాహువులు, జానువులు గ్రహింపబడి విడిచిపెట్టబడినవి. ఇచ్చట కన్నుల ఇత్యాది పూర్వము విశేష్యము. పూర్వమున కుత్తరము విశేషణమగుచు గృహీత ముక్తరీతి యున్నది కావ నిది ఏకావళ్యలంకారము.

## 48. మాలాదీపకాలంకారము

103, దీపకైకావళీ యోగా న్మాలాదీపక ముచ్యతే ।
స్మరేణ హృదయే తస్యాస్తేన త్వయి కృతాస్థితిః।

గీ. దీపకైకావళీ సంగతిం దనర్చి
ఖ్యాతికెక్కు మాలా దీపకం బనంగ
స్మరుఁడు వసియించెఁ దన్మానసమున దాని
మనసు నీయందు వర్తించె నను విధమున. 113

దీపకము, ఏకావళి అలంకారములు రెండును కలసియుండిన నది మాలాదీపకాలంకారము.

'స్మరుఁడు తన్మానసమున, దాని మనసు నీయందును వర్తించెను.'

ఇట వర్తించెనను క్రియ స్మరునికి, మనసునకు రెండిటికి అన్వయించుచున్నది కాన దీపకము. మనసు అను శబ్దము గ్రహింపఁబడి విడువఁబడినది గాన ఏకావళి. ఈ రెండును ఇట కలిసియుండుటచే నిది మాలాదీపకాలంకారము.

## 49. సారాలంకారము

104. ఉత్తరోత్తర ముత్కర్ష స్సార ఇత్యభిధీయతే ।
మధురం మధు పీయూషం తస్మాత్తస్మాత్ కవేర్వచః ॥

గీ. సారమను పేరుగల యలంకార ముత్త
రోత్తరోత్కర్ష గతి నొప్పుచుండుఁ గృతుల
దేనె యమృతంబు మధురము ల్వానికంటెఁ
గవిజనంబుల పలుకు లన్కరణి శర్వ. 114

ఉత్తరోత్తరములకు ఉత్కర్ష(శ్రేష్ఠత్వము) వర్ణింపఁబడిన నది సారాలంకారము.

'తేనె మధురము, దానికంటె నమృతము మధురము, దానికంటె కవి వాక్కులు మధురములు.'

## 50. యథాసంఖ్యాలంకారము

105 యథా సంఖ్యం క్రమేణైవ క్రమికాణాం
సమన్వయః ।
శత్రుం మిత్రం విపత్తిం చ జయ రఞ్జయ భఞ్జయ॥

గీ. వరుసనే క్రమికా సమన్వయము గలుగ
నది యథాసంఖ్య మనఁగఁ బెంపారుఁ గృతుల
నహిత కోటుల నాప్తుల నాపదలను
గెలుము రంజిల్లఁజేయుము గెడపు మనఁగ. 115

దీనికే క్రమాలంకారమనియు పేరు. క్రమముగా సమాన సంఖ్యాకము లగువాని యొక్క సమన్వయము యథాసంఖ్యాలంకారము.

'శత్రువుల, మిత్రుల, నాపదలను గెలుము, రంజిల్ల జేయుము, నశింప జేయుము.' క్రమముగా సమన్వయ పరుప శత్రుల గెలువుము, మిత్రుల రంజిల్లజేయుము, ఆపదలను నశింపజేయుము. అని యథా సంఖ్యముగా సమన్వయించుచున్నది గాన యథాసంఖ్యాలంకారము.

## 51. పర్యాయాలంకారము

106, పర్యాయో యది పర్యాయేణైక స్యానేక సంశ్రయః।
పద్మం ముక్త్వా గతా చంద్రం కామినీ వదనోపమా॥

గీ. తనరుఁ బర్యాయ మొక వస్తువున కనేక
సంశ్రయత భాతి చేతను సంభవింపఁ
దమ్మి విడిచి సుధాకరుఁ దవిలెఁ గామి
నీ ముఖప్రభ యన్నట్లు నీలకంఠ. 116

ఒక వస్తువునకు అనేకాశ్రయములు చెప్పబడిన అనగా ఒక ఆశ్రయము తరువాత మరియొక ఆశ్రయము పర్యాయముగా పొందినట్లు చెప్పబడిన నది పర్యాయాలంకారము.

కామినీ ! నీ ముఖప్రభలు పద్మమును విడిచి చంద్రుని పొందినవి,

రాత్రి పద్మములు ముకుళించుట, చంద్రుడు ప్రకాశించుట సహజము. కామినీముఖ కాంతి పద్మములను విడిచి చంద్రుని పొందినట్లు కల్పింపబడినది. ముఖము పద్మ, చంద్ర సదృశమని తేలినది. పగలు పద్మమును, రాత్రి చంద్రుని పర్యాయముగా పొందినదగుటచే నిది పర్యాయాలంకారము.

107. ఏకస్మి న్యద్యనేకంవా పర్యాయసోఽపి సమ్మతః ।
అధునా పులినం తత్ర యత్ర స్రోతః పురాజని ॥

గీ. ఒక్కటనేక మగునేని నొప్పుచుండు
నదియు వేఱొక పర్యాయ మనఁగఁ దొల్లి
ఎచట జనియించెను ప్రవాహ మచట నిప్పు
డిసుకతిన్నియ యన్నట్లహీన భూమ. 117

ఒక్క వస్తువునే అనేక వస్తువులు పర్యాయమున ఆశ్రయించినట్లు చెప్పిన నదియు పర్యాయాలంకారము.

'వెనుక ప్రవాహము జనించినచోటు ఇపుడు ఇసుకతిన్నె.'

ప్రవాహము, ఇసుకతిన్నె ఒక్కచోటనే పర్యాయమున నుండినట్లు చెప్పబడినది గాన నిది పర్యాయాలంకారము.

## 52. పరివృత్త్యలంకారము

108. పరివృత్తి ర్వినిమయో న్యూనాభ్యధికయో ర్మిథః ।
జగ్రాహైకం శరం ముక్త్వా కటాక్షాంత్స రిపుశ్రియః॥

గీ. కావ్యములయందు న్యూనాధికముల వినిమ
యంబు పరివృత్త్యలంకృతి యండ్రు బుధులు
ఏక విశిఖంబు విడిచి గ్రహించె నాతఁ
డరి నృపాలక లక్ష్మీ కటాక్షములను. 118

న్యూనాధికముల వినిమయము పరివృత్త్యలంకారము,

అల్పమిచ్చి అధికము పుచ్చుకొనుటగాని, అధికమిచ్చి అల్పము పుచ్చుకొనుటగాని పరివృత్త్యలంకారము.

'ఒక్క బాణము విడిచి అతఁడు శత్రురాజుల లక్ష్మీకటాక్షములను గ్రహించెను' అల్పమగు బాణము నిచ్చి అధికమగు వారి రాజ్యసంపదలను గ్రహించెనన శత్రురాజుల నోడించెనని తెలియుచున్నది.

ఇట్లే అధికము నిచ్చి అల్పమును గ్రహించినట్లు తెల్పిన నదియు పరివృత్త్యలంకారము. ఉదా : నీ శత్రురాజులు బోయల-కాభరణముల నిచ్చి వల్కలములు గ్రహించిరి.

## 53. పరిసంఖ్యాలంకారము

109. పరిసంఖ్యా నిషిధ్యైక మేకస్మి న్వస్తు యన్త్రణమ్ ।
స్నేహక్షయః ప్రదీపేషు న స్వాంతేషు నతభ్రువామ్॥

గీ. ఒక్కచోట నిషేధించి యొకట వస్తు
యంత్రణము సేయఁ బరిసంఖ్యయనఁగఁ బరఁగు
లేదు స్నేహక్షయంబు నాళీకముఖుల
డెందములయందు దీపములందుఁ గాని 119

ఒక వస్తువును ఒకచోట నిరోధించి మరియొకచోట యంత్రణము (నియమించుట) పరిసంఖ్య.

'స్నేహక్షయము దీపములందు గాని స్త్రీల డెందములందు లేదు.' స్నేహక్షయమునకు దీపములందు యంత్రణ, స్త్రీ చిత్తములందు నిషేధము. ఇట్లు ఒకచోట విధి మరియొకచోట నిషేధము చెప్పబడుటచే నిది పరిసంఖ్యాలంకారము.

స్నేహక్షయ మన చమురు తగ్గిపోవుట, ప్రేమ తగ్గిపోవుట అని అర్థములు. కావున విధినిషేధములు సరిపడినవి.

## 54. వికల్పాలంకారము

110. విరోధే తుల్యబలయో ర్వికల్పాలంకృతి ర్మతా ।
సద్య శ్శిరాంసి చాపాన్వా నమయంతు మహీభుజః॥

గీ. కృతిఁ దగు వికల్పమను నలంకృతి సమాన
బలములకును విరోధంబు గలుగుచుండ
మస్తకము లొండె విల్లొండె మనుజనాథు
లవుడువంతురు గాక యన్నట్టు లీశ. 120

సమాన బలములకు విరోధము కలుగుచుండిన నది వికల్పాలంకారము.

రెండు పనులు సమాన ప్రాధాన్యము కలవి. ఒక పనియైనచో రెండవపని కాదు. ఇట్లు రెండుపనులకు విరోధము కలుగుచుండిన నది వికల్పాలంకారము.

'శత్రురాజులు మస్తకములనుగాని, ధనుస్సులనుగాని వంతురు.' తలలు వంచుట, ధనుస్సు వంచుట రెండును సమాన ప్రాధాన్యము కలవి. తలలు వంచుట ఓడినట్లంగీకరించుట కాన ధనుస్సు వంచుపని లేదు. ధనుస్సు వంచుట యుద్ధమునకు సిద్ధపడుట, తల వంచుట వీలుకాదు. ఇట్లు అదికాకుండిన ఇది అని తెల్పబడుటచే నిది వికల్పాలంకారము

## 55. సముచ్చయాలంకారము

111. బహూనాం యుగపద్భావభాజాం గుంభ
స్సముచ్చయ
నశ్యంతి పశ్చాత్పశ్యంతి భ్రమంతి చ తవాహితాః॥

ఆ. యుగపద్య భాజనావళీ గుంభనం
బైన నది సముచ్చయం బటండ్రు
సమయుదురు గనుదురు జాఱిపోదురు పాఱు
దు రని నీ రిపు లన నురగభూష. 121

ఏక కాలమునందు జరుగుటకు వీలైన అనేకములను ఒక్కచో కూర్చి చెప్పిన సముచ్చయాలంకారమగును.

'నీ శత్రువులు నశింతురు, పారిపోదురు, వెనుదిరిగి చూతురు, భ్రమ్మరులగుదురు.' శత్రురాజులు రాజ్యము కోల్పోవుట, ఆ[illegible]ములకు

క. తనరును గారకదీపక
మనఁ గ్రమికైక గత గుంభమైనను గృతులన్
జనియెడిఁ గ్రమ్మర వచ్చెడిఁ
గనియెడిఁ బాంథజనుఁ డడుగఁ గడఁగెడి వసఁగన్ 123

క్రమ ప్రాప్తములు, ఏక కర్తృగతములు నగు క్రియల కూర్పు కారక దీపకాలంకారమగును.

'పాంథుడు పోవును, మరల వచ్చును, చూచును, ప్రశ్నించును'

దీనిలోని క్రియలన్నియు ఏక కర్తృగతములు (పాంథుడు) క్రమ ప్రాప్తములు కావున కారక దీపకాలంకారము. వెళ్ళుట, వచ్చుట ఏకకా కృత్యములు కావుకాన ఇది సముచ్చయాలంకారము కాలేదు. కావున అట్లు భ్రమింపకూడదు.

## 57. సమాధ్యలంకారము

111. సమాధిః కార్య సౌకర్యం కారణాన్తర సన్నిధేః।
ఉత్కంఠితాచ కులటా జగామాస్తం చ భానుమాన్॥

గీ. కార్య సుకరత వేఱొక్క కారణాప్తి
వలనఁ గలుగ సమాధినా నలరుఁ గృతులఁ
గులట వాంఛను బొందె నర్కుఁడును గ్రుంగె
ననెడు చందాన శైలకన్యాసహాయ. 124

కార్యసాఫల్యమునకు కావలసిన కారణముచే గాక మఱియొక కారణమువలన కార్యము సాఫల్యమునందిన అది సమాధ్యలంకారమగును

'కులట వాంఛను పొందినది, సూర్యుడు అస్తమించెను.'

వాంఛ తీరుటకు ప్రియుని చేరవలెను. వెలుతురున్నచో దానికి భంగము. సూర్యుడస్తమించుటతో సంశయము, భయము తీఱినవి. కాకతాళీయముగా సూర్యు డస్తమించుటతో ఆమె పనికి కారణాంతరమున సౌకర్య మేర్పడినది కావున ఇది సమాధ్యలంకారము.

## 58. ప్రత్యనీకాలంకారము

115. ప్రత్యనీకం బలవతశ్శత్రోః పక్షే పరాక్రమః ।
జైత్రనేత్రానుగౌ కర్ణా వుత్పలాభ్యా మధఃకృతౌ॥

గీ. ప్రబలతర నిజ శాత్రవ పక్షవర్తి
నిరసనముసేఁత యగు ప్రత్యనీక మనఁగ
తన్ను గెలిచిన చూడ్కుల దాకియున్న
చెవుల నుత్పలములు క్రిందుఁ జేసికొనియె 125

ప్రబలమైన శత్రువు నెదిరింపలేక వాని పక్షమువారిపై పరాక్రమము చూపుట ప్రత్యనీకాలంకారమగును.

'చూడ్కులు తమను గెలువ, చేరువనున్న చెవులను ఉత్పలములు క్రిందుచేసికొన్నవి.'

ఉత్పలములు తమను జయించిన నేత్రముల నేమియు చేయలేక చేరువనున్న కర్ణములపై ప్రతాపము చూపినవి అని అర్థము ఉత్పలములు కర్ణములమీద నుండును అపుడు కర్ణములు క్రిందుచేయబడినవి కదా !

## 59. కావ్యార్థాపత్త్యలంకారము

116. కైముత్యే నార్థసంసిద్ధిః కావ్యార్థాపత్తి రిష్యతే ।
స జిత స్త్వన్ముఖే నేన్దుః కావార్తా సరసీరుహామ్॥

క. ఏపారుచుండుఁ గావ్యా
ర్థాపత్తి యనంగఁ గృతుల యందును గైము
త్యాపాదితార్థ సిద్ధత
శ్రీపర్వత దుహితృరమణ శేషాభరణా! 126

గీ. శశిని నీల తిరస్కార చారు చికుర
గెలిచితివి నీ ముఖంబుచే జలజ రిపునిఁ
బంకజంబుల వార్తఁ జెప్పంగ నేల
యనెడు చంద్రాస శైలకన్యా సహాయ. 127

కైముత్యము చేత ఇష్టార్థసిద్ధి పేర్కొనబడిన అది కావ్యార్థాపత్త్య లంకారమగును. కిముత యనగా "ఇంక నెంత" అని అర్థము. 'కిముతస్య భావః కైముత్యమ్.'

'ప్రేయసీ! నీ ముఖముచే చంద్రుని గెలిచితివి, పద్మములమాట చెప్పనేల?' పద్మములు చంద్రుని చూడగనే ముకుళించును. కావున చంద్రుడు పద్మములను జయించెను. ఆ చంద్రుని ప్రేయసిముఖము జయించినది కావున పద్మములను జయించునని వేరుగ చెప్పపనిలేదు చెప్పకుండగనే గతార్థమగుచున్నది.

అభిలషితమైన అర్థమును పొందుట అర్థాపత్తి. దీనిని అర్థాపత్త్యలం కారమనిన చాలును కా తాంత్రికార్థాపత్తి వేఱొకటి యున్నది. శంకా

నివారణమునకే ఇది కావ్యార్థాపత్త్యలంకారము. కావ్యసంబంధి యని వివరణము.

## 60. కావ్యలింగాలంకారము

117. సమర్థనీయ స్యార్థస్య కావ్యలింగం సమర్థనమ్ ।
జితోఽసి మంద కందర్ప మచ్చిత్తేఽస్తి త్రిలోచనః॥

గీ. సాధనీయార్థ సిద్ధికి సాధనంబు
కావ్యలింగ మనంగఁ బ్రఖ్యాతి కెక్కు.
మనసిజుఁడు గెల్వబడియెడు మన్మనంబు
లో నిలిచియున్నవాఁడు త్రిలోచనుండు. 128

సమర్థింపవలసిన అర్థమునకు సాధనమును తెల్పిన అది కావ్యలింగా లంకారమగును.

'మన్మథా ! గెలువబడితివి నా మనసులో త్రిలోచనుడున్నాడు. మన్మథుని గెలుచుట దుష్కరము. సమర్థింపవలసిన అంశము త్రిలోచను డున్నాడని సమర్థింపబడినది కాన నిది కావ్యాలింగాలంకారము.

## 61. అర్థాంతరన్యాసాలంకారము

118. ఉక్తి రర్థాంతరన్యాస స్స్యాత్ సామాన్య విశేషయోః,
హనూమా నబ్ధి మతర ద్దుష్కరం కిం
మహాత్మనామ్॥

గీ. సర్వసామాన్యమును విశేషంబు నుక్తి
యమర నర్థాంతరన్యాస మనఁగఁ బరగు
నాంజనేయుఁడు లంఘించె నంబురాశి
యహహా ! దుస్తర మెద్ది మహాత్ములకును. 129

విశేషము, సామాన్యము తెలుపుట అర్థాంతరన్యాస

విశేషమును చెప్పి దానిని సమర్థించుటకు సామాన్యమును చెప్పిన అది అర్థాంతరన్యాస మొదటి భేదము.

'ఆంజనేయుడు అంబురాశిని లంఘించెను. ఆహా ! మహాత్ములకు దుస్తరమేది?' అంబురాశి లంఘనము దుస్తరము మహాత్ముల కసాధ్యము లేదనుట సామాన్యము. కావున నిది అర్థాంతరన్యాసాలంకారము.

119. గుణవద్వస్తు సంసర్గా ద్యాతి స్వల్పోఽపి గౌరవమ్ ।
పుష్పమాలానుషంగేణ సూత్రం శిరసి ధార్యతే॥

గీ. అల్పవస్తువైన నధిక గుణాఢ్య సం
బంధమునను గౌరవంబు గాంచు
కుసుమమాలతోడఁ గూడుటచేఁ గాదె
త్రాడు తలలచేతఁ దాల్పఁబడియె. 130

సామాన్యమును చెప్పి విశేషమును చెప్పుట అర్థాంతరన్యాస రెండవ భేదము.

'అల్పవస్తువైనను గుణవద్వస్తు సంసర్గము వలన గౌరవము నందును. పుష్పమాలతో కూడియుండుటచేత త్రాడు కూడా తలలపైఁ ధరింపబడుచున్నది.'

ఇందు ముందు సామాన్యవిషయము చెప్పబడినది, అల్పవస్తువైన దారము గుణవద్వస్తువైన పుష్పములతో కూడియుండుటచేత తలపై ధరింపబడి గౌరవ మందుచున్నదను విశేషము చెప్పబడినది. కాన నిది అర్థాంతరన్యాసాలంకార మైనది.

## 62. వికస్వరాలంకారము

120. యస్మిన్విశేష సామాన్య విశేషాస్స వికస్వరః।
స న జిగ్యే మహాన్తోహి దుర్ధర్షా స్సాగరా ఇవ॥

గీ. సరవిగా విశేష సామాన్యములు విశే
షంబులను వికస్వరం బనఁబడు
నతఁ డజయ్యుఁడయ్యె నట్లనౌ గంభీరు
లప్రధృష్యులగుదు రబ్ధు లట్లు. 131

ఒక విశేషమును సమర్థించుచు ఒక సామాన్యమును చెప్పి, దానిపై మఱియొక విశేషము చెప్పబడిన అది వికస్వరాలంకార మగును.

'అత డజయ్యుడు, మహాత్ములు సాగరములట్లు దుర్ధర్షు లయ్యెదరుగదా !'

అత డజయ్యుడు విశేష విషయము 'మహాత్ములు దుర్ధర్షులుగదా !' అను సామాన్యవిషయముచే నిది సమర్థింపబడినది. దీనిని ఋజువుపరచుటకై 'సాగరము లట్లు' అను మఱియొక విశేషము చెప్పబడుటచే పూర్వోక్త విశేషార్థము సమర్థింపబడినది కాన నిది వికస్వరాలంకారము.

## 63. ప్రౌఢోక్త్యలంకారము

121. ప్రౌఢోక్తి రుత్కర్షా హేతౌ తద్ధేతుత్వ
ప్రకల్పనమ్ ।
కచాః కళిందజా తీర తమాలస్తోమ మేచకాః॥

గీ. ఎసగు ప్రౌఢోక్తి యుత్కర్ష హేతుతా వి
హీనమైనది యతిశయ హేతువనినఁ
దరుణి కురులు కళిందజా తట తమాల
సముదయ శ్యామలము లను చందమునను. 122

వస్తువుయొక్క ఉత్కర్షకు హేతువు కానిదానిని ఉత్కర్షకు హేతువని చెప్పిన అది ప్రౌఢోక్త్యలంకార మగును.

'తరుణి కురులు యమునానదీ తీర తమాల సముదాయమువలె నల్లనైనవి.'

తమాలవృక్షము సహజముగా నల్లనిది. యమునానది నల్లనిది. యమునానదీ తీరస్థమగుటచే తమాలమునకు నల్లదనము కలుగలేదు, పెరుగలేదు కాని తరుణి కురులు మరీ నల్లనివని తెల్పుటకు ఆశ్రయ గుణమును బట్టి ఆశ్రితములకు మరింత నల్లదనము వచ్చినదని చెప్పుట విశేషము. అది ప్రౌఢోక్తియే కాని నిజమున కట్లు కాదు. కాన నిది ప్రౌఢోక్త్యలంకారము.

ఉత్ప్రేక్షకు ప్రౌఢోక్తికి భేదమేమన – ఉత్ప్రేక్షలో వస్తుసిద్ధికి హేతువును భావింతుము. ప్రౌఢోక్తిలో వస్తుసిద్ధికి కాక, దాని ఉత్కర్షకు హేతువును కల్పింతుము.

## 64. సంభావనాలంకారము

122. సంభావనం యదిత్థం స్యా దిత్యూహోఽన్యస్య సిద్ధయే।
యది శేషో భవేద్వక్తా కథితాస్స్యుర్గుణా స్తవ॥

గీ. ఎనయు నీకార్య మిది యయ్యె నేని యనెడు
నూహ సంభావన యనంగ నొప్పుఁగృతుల
నహికులాధీశ్వరుఁడు వక్త యయ్యె నేని
నెన్నఁదగు నీదు సుగుణంబు లన్నయట్లు. 133

ఇది ఇట్లయినచో ఈ కార్యము సిద్ధించునని ఊహించుట సంభావనాలంకార మగును.

'శేషుడు వక్తయయిన నీ సుగుణముల నెన్నగలడు.'

అతని గుణములు వేయితలలు కల శేషుడు వర్ణింపవలెను గాని ఏకశిరస్కుఁడగు మనుజుడు వర్ణింపలేడు. అనుటచే రాజు గుణము లగణ్యము లని తెలియుచున్నది. శేషుడు వక్తయైన అని ఊహింపబడుటచే నిది సంభావన.

## 65. మిథ్యాధ్యవసిత్యలంకారము

123. కించిన్మిథ్యాత్వ సిద్ధ్యర్థం మిథ్యార్థాంతర కల్పనమ్
మిథ్యాధ్యవసితి ర్వేశ్యాం వశయేత్ ఖస్రజం వహన్॥

గీ అల్పతరమైన యట్టి మిథ్యాత్వసిద్ధి
కన్యమిథ్యార్థ కల్పనం బయ్యెనేని
నగును మిథ్యాధ్యవసితి యార్యను భజించు
నది నభస్స్రజ మూనుచు నన్నకరణి 134

ఒక్కదానియొక్క మిథ్యాత్వమును నిరూపించుటకై మఱియొక మిథ్యార్థమును కల్పించిన అది మిథ్యాధ్యవసిత్యలంకార మగును.

ఆకాశపుష్పమాల ధరించి వేశ్యను వశీకరింపుము.

ఆకాశపుష్పమాల ధారణము అసంభవము, వేశ్యా వశీకరణము అటులనే అసంభవము. మిధ్య యన లేనిదనియే భావము.

## 66. లలితాలంకారము

124. ప్రస్తుతే వర్ణ్య వాక్యార్థ ప్రతిబింబస్య వర్ణనమ్।
లలితం, నిర్గతే నీరే సేతుమేషా చికీర్షతి॥

గీ. ప్రస్తుతం బగుచుండ వర్ణ్యవచనార్థ
మపుడు ప్రతిబింబ వర్ణనం బయ్యెనేని
లలితమన నలరుచు నుండు జలము దొలఁగఁ
గట్ట గట్టెడి నిది యను కరణి ధరణి 135

వర్ణ్య వచనార్థము ప్రస్తుత మగుచుండ తత్ప్రతిబింబ వర్ణనము కావింపబడిన నది లలితాలంకార మగును.

'ఈమె నీరు పోయిన పిదప గట్టు కట్టదలచు చున్నది' ఇది నాయికను గూర్చి చెలికత్తె పలికినది. నాయకుడు తన చెంతకు రా.గా

తిరస్కరించిన నాయిక ఇపు డాతని చెంతకు చెలికత్తెను పంపబోగా ఆమె యిట్లు పల్కినది. నీరు పోయినతరువాత గట్టువేయుట ఎట్లు నిష్ప్రయోజనమో అట్లే తన రాయబారమును వ్యర్థమని భావముతో లలితముగా చెప్పబడినది. ఆ మాటల కీమాటలు ప్రతిబింబ భూతములు. ఈ మాటల వలన ఆ మాటల యర్థము స్ఫురించుచున్నది కాన ఇది లలితాలంకారము.

## 67 ప్రహర్షణాలంకారము

125. ఉత్కంఠితార్థ సంసిద్ధి ర్వినాయత్నం ప్రహర్షణం ।
తామేవ ధ్యాయతే తస్మై నిసృష్టా సైవ దూతికా॥

గీ॥ అప్రయత్నంబుచే వాంఛితార్థ సిద్ధి
యయ్యెనేనిఁ బ్రహర్షణం బనఁగఁ బరఁగు
దానిని మనంబునందునఁ దలఁచుచుండ
నదియె దూతికయైచనె నతని కొఱకు 136

అప్రయత్నముగనే వాంఛితార్థ సిద్ధి యయిన అది ప్రహర్షణాలంకారమగును.

'ఎవతె నాతడు మనమున తలచుచుండెనో ఆమెయే దూతికయై అతని చెంతకు వెళ్ళెను.'

ఏ దూతికను నాయకుడు కోరుచుండెనో ఆ దూతికయే అప్రయత్నముగ అతని చెంతకు చేరెను. ప్రయత్నములేకయే వాంఛితార్థ సిద్ధి యయినది గాన నిది ప్రహర్షణాలంకారము.

126. వాంఛితా దధికార్థస్య సంసిద్ధిశ్చ ప్రహర్షణమ్।
దీప ముద్ద్యోతయే ద్యావ త్తావ దభ్యుదితో రవిః॥

గీ. అన్యగతి వాంఛితాభ్యధికార్థ సిద్ధి
యును ప్రహర్షణాలంకార మనిరి కృతుల
నెంతవడి దివ్వె వెలిఁగించె నంతలోన
నర్కుఁ డభ్యుదితుండయ్యె ననఁగ శర్వ　　137

వాంఛితార్థము కన్నను అధికమైన యర్థ సంసిద్ధికూడ ప్రహర్షణాలంకారమే యగును.

'దీపమును వెలిగించునంతలో సూర్యుడే ఉదయించెను. ఇచట వెలుతురు ప్రయోజనము. దీపము వెలిగింపబూన సూర్యుడే ఉదయించుటచే అధిక ప్రయోజనము సిద్ధించినది కావున నిది ప్రహర్షణము.

127. యత్నా దుపాయ సిద్ధ్యర్థా త్సాక్షాల్లాభః ఫలస్యచ।
నిధ్యంజ నౌషధీమూలం ఖనతా సాధితో నిధిః॥

గీ. అభిమతార్థ ముపాయ సిద్ధ్యర్థ యత్న
మునను సాక్షాత్కరించినఁ దనరు నదియు
కోర్కె నిధ్యంజనౌషధి వేరుద్రవ్వ
నతనిచే నిధి సాధితంబయ్యె ననఁగ　　138

అభిమతార్థ సిద్ధికొఱకు ప్రయత్నించుచుండగ ఫలము సాక్షాత్కరించినదియు ప్రహర్షణాలంకారము.

'నిధ్యంజనౌషధి వేరు త్రవ్వుచుండగా నిధియే లభించినది. కోరిక నిధి తీర్చునది అంజనము. అంజన సిద్ధికొరకు ప్రయత్నించుచుండగా నిధియే దొరికినది. ఫలసాధనకు ప్రయత్నించుచుండ ఫలమే లభించినది గాన నిది ప్రహర్షణాలంకారము.

## 68. విషాదనాలంకారము

128\. ఇష్యమాణ విరుద్ధార్థ సంప్రాప్తిస్తు విషాదనమ్।
దీప ముద్ద్యోతయద్యావ న్నిర్వాణ స్తావదేవ సః॥

గీ. అభిమతార్థంబునకు విరుద్ధార్థసిద్ధి
యైనను విషాదనం బన నలరుఁ గృతుల
నెంత వడిదివ్వె వెలిఁగించె నంతలోన
నది నశించెననంగ లక్ష్యము మహేశ 139

అభిమతార్థమునకు విరుద్ధముగానయిన అది విషాదనాలంకారమగును. 'ఎంతసేపు దీపము వెలిగించెనో అంతలోన అది నశించెను' దీపము వెలిగించుట అభిమతార్థము; కాని విరుద్ధముగా దీపము ఆరిపోయినది గాన ఇది విషాదనాలంకారము.

## 69. ఉల్లాసాలంకారము

129\. ఏకస్య గుణదోషాభ్యా ముల్లాసోఽన్యస్య తౌ యది।
అపి మాం పావయేత్సాధ్వీ స్నాత్వే తీచ్ఛతి జాహ్నవీ

గీ. ఒప్పు నుల్లాస మన్యునం దొక్కని గుణ
దోషములచేత నవిరెండు దొరలెనేని
నన్ను నఘుఁ జేయుఁగాత స్నానం బొనర్చి
సాధ్వియని యిచ్ఛగించెడు జహ్నుకన్య 141

ఒకని గుణ దోషములచేత అన్యునందు ఆ గుణదోషములు ప్రాప్తిం

చిన అది ఉల్లాసాలంకారము ఈ లక్షణము నాలుగు విధములు; 1, ఒకని గుణము వలన అన్యునకు గుణము కలుగుట, 2, ఒకని దోషమువలన అన్యునకు దోషము కలుగుట, 3, ఒకని గుణమువలన అన్యునకు దోషము కలుగుట, 4, ఒకని దోషమువలన అన్యునకు గుణము కలుగుట.

'సాధ్వి నాయందు స్నానమొనర్చి నన్ను పావనము చేయుగాక యని గంగ తలంచెను. సాధ్వి పవిత్రతా గుణము గంగకును కలుగు చుండుటచే నిది ఉల్లాసమున మొదటి భేదమగుచున్నది.

130. కాఠిన్యం కుచయోస్స్రష్టం వాంఛన్త్యః పాద పద్మయోః।

నిన్దన్తి విశ్వధాతారం త్వ ధాటీష్వరి యోషితః॥

గీ. కఠినత కుచంబులకుఁ జేసెఁగాక చరణ
ములకు నీఁడయ్యె మార్దవంబునె యొసంగె
నకట యిట్లేల చేసెనో యంబుజభవుఁ
డనుచు నిందించు నీ ధాటి యరివధూటి 141

'కఠినత కుచముల కిచ్చెనే గాని పాదముల కియ్యడాయెను. మృదుత్వమునే ఇచ్చెను. అయ్యో! ఇట్లేల చేసెనో యని నీ ధాటికి శత్రురాజ స్త్రీలు బ్రహ్మను నిందింతురు' శత్రురాజులు పాఱిపోవుచుండిరి. వారి స్త్రీల పాదములు కోమలములగుటచే వారుతమ భర్తలననుసరింప లేకపోవుచుండిరి కావున ఓ బ్రహ్మ! కుచములకు కాఠిన్యము నొసగితివి గాని ఆ కఠినత్వమును పాదములకేల ఈయకపోతివని నిందించిరి. కాఠిన్యము లేక పోవుట యను దోషముచేత బ్రహ్మకు దోషము చెప్పబడినది గాన నిది ఉల్లాసమునందలి రెండవ భేదము.

131. తదభాగ్యం ధనస్యైవ య న్నాశ్రయతి సజ్జనమ్।
లాభోఽ యమేవ భూపాలసేవకానాం నచే ద్వధః॥

గీ. సజ్జనుని నాశ్రయింపదు స్వాపతేయ
మాయభాగ్యంబు దానిదే యరసిచూడ
వధము లేకున్కి నీదు సేవకజనులకు
పరమ లాభంబుగాదె భూపాలవర్య ! 142

'సజ్జనుని యాశ్రయింపక పోవుట ధనముయొక్క అభాగ్యము. సజ్జనుని సజ్జనత్వమను గుణముయొక్క ఆశ్రయముచేత ధనమునకు సజ్జనుల నాశ్రయింపక పోవుట యను దోషము వర్ణింపబడుటచే నిది గుణముచేత దోషము కలుగుట యను ఉల్లాసము నందలి మూడవ భేదము.

'వధము లేకుండిన రాజసేవకుల కదియే లాభము రాజసేవ నిత్యము ప్రాణాపాయకరము. ఏ నిముషమున రాజుయొక్క ఆగ్రహమునకు గురి కావలసివచ్చునో తెలియదు. కావున రాజసేవ దోషముచేత వధ లేకపోవుట గుణముగ వర్ణింపబడినదిగాన నిది ఉల్లాసమున నాల్గవ భేదము.

## 70. అవజ్ఞాలంకారము

132. తాభ్యాం తౌ యది నస్యాతా మవజ్ఞాలంకృతి ర్మతా
స్వల్పమేవాంబు లభతే ప్రస్థః ప్రాప్యాపి సాగరమ్,
మీలంతి యది పద్మాని కాహాని రమృత ద్యుతేః॥

సీ. వానిచే నవి రెండు గావేని గృతుల
నది యవజ్ఞ యనంగఁ బ్రఖ్యాతికెక్కుఁ
దోయ మల్పముఁ జెందెడిఁ దూము వారి
రాశి చెందియు నన్నట్లు రాజమకుట!
తన యుదయమందు నిద్రించు తామరసము
లట్లయిన చంద్రునకు నేమి హాని యభవ. 144

ఒకని గుణదోషముల వలన అన్యునకు ఆ గుణదోషములు కలుగకుండిన అది అవజ్ఞాలంకారమగును.

ఇది రెండు విధములు: 1, ఒకని గుణమువలన అన్యునకు గుణము కలుగకుండుట, 2, ఒకని దోషము వలన అన్యునకు దోషము కలుగకుండుట.

'కుంచమున సముద్రమున ముంచినను కొంచెము జలమునే తెచ్చును సముద్రము అపార జల సంతయుము. ఆ గుణము అందుముంచిన కుంచమునకు రాలేదు. గుణము వలన గుణము రాకపోవుటచే నిది అవజ్ఞాలంకారమున మొదటి భేదము.

'పద్మములు ముకుళించుకొన్నచో చంద్రునికి హాని ఏమి? ముకుళించుకొనుట పద్మముల దోషము దానివలన చంద్రునికి దోషము ప్రాప్తించుట లేదు కావున నిది అవజ్ఞాలంకారమున రెండవ భేదము.

## 71. అనుజ్ఞాలంకారము.

131. దోషస్యాభ్యర్థ నానుజ్ఞాతస్మైవ గుణదర్శనాత్।
విపద స్సంతు నశ్శశ్వద్యాసు సంకీర్త్యతే హరిః॥

గీ. గుణ మచటఁజూచి దోషంబు గోరెనేని
నది యనుజ్ఞ యనంగఁ బ్రఖ్యాతికెక్కు
నాపదలె యుండుఁగాక మా కనయమును వి
పత్తులను శౌరి కీర్తింపఁబడు ననంగ 145

దోషమునందు గుణమును చూచి ఆ దోషమే కావలయునని కోరుట అనుజ్ఞాలంకారమగును

'మా కెల్లప్పుడు ఆపదలే యగుగాక, ఆపదలందే హరిని స్మరింతుము. ఆపదలు దోషము కాని, హరిని స్మరించుట యను గుణమందుండుటచే ఆ దోషమే కావలె నని కోరబడుచున్నది కాన నిది అనుజ్ఞాలంకారము.

## 72. లేశాలంకారము.

135. లేశ స్స్యాద్దోషగుణయో ర్గుణదోషత్వ కల్పనమ్।
అఖిలేషు విహంగేషు హంత స్వచ్ఛంద చారిషు
శుక। పంజర బంధస్తే మధురాణాం గిరాం ఫలమ్॥

క. సముచిత వృత్తిని దోష గు
ణములకు గుణదోష కల్పనము గల్గిన గా
వ్యములన్ లేశాలంకా
ర మనం బ్రఖ్యాతి కెక్కు రాజవతంసా. 146

గీ. వలసి నట్టులు దిరుగు నఖిల విహంగ
రాజి యందున రాజ కీరంబ నీకుఁ
గటగటా! పంజరంబునఁ గట్టువడుట
యనుపమములైన మధుర వాక్యముల ఫలము. 147

దోషగుణములకు, గుణదోషములు కల్పింపబడిన అది లేశాలంకార మగను.

'ఓ చిలుకా ! వలసినట్లు తిరుగు పక్షులన్నిటిలో, అయ్యో ! పంజర మున కట్టువడుట నీ మధుర వాక్యముల ఫలము. చిలుక మధురముగా పల్కును, మిగిలిన పక్షులకు ఆ గుణము లేకపోవుట దోషము. ఆ దోషమే గుణమై మిగిలిన పక్షులు స్వేచ్ఛగా విహరించ కలుగుచున్నవి. చిలుక మధురముగా పలుకుట గుణము. ఆ గుణమే దోషమై పంజరమున బంధింప బడినది. ఇట్లు దోషము గుణముగను, గుణము దోషముగను చెప్పబడుటచే నిది లేశాలంకారమైనది.

ఇచట చిలుకను గూర్చిగాక కవి తననుగూర్చి తాను పలికెనేని లేశాలంకారమే యగును. ఒకకవి రాజాస్థానమున నుండిపోయెను. స్వేచ్ఛా విహారమునకు ఆటంకము కలుగుటచే ఆ కవి తనను గూర్చి పై వాక్యము లనుకొనెను. తన తోటివారికి తన పాండిత్యము లేదు కావున వారికి రాజసభ నిర్బంధములేదు. వారు స్వేచ్ఛా విహారులు. ఆ పాండిత్య గుణమే తనపట్ల దోషకారియై నిర్బంధమును విధించినదని అనుకొనుటచే నిది లేశాలంకారము

అట్లుకాక ఈ పలుకులు కవి తండ్రి పలికినట్లు చెప్పుకొనిన ఇది అప్రస్తుతాలంకార మగును. ప్రకృతమును చెప్పవలసియుండగా దానిని చెప్పక అది స్ఫురించునట్లుగా అప్రకృతమును చెప్పిన అది అప్రస్తుతాలం కారము. తండ్రి తనకుమారుడు తనను చూచుటకైనను రాకపోవుటచే బాధతో ఈపలుకులుపలికినట్లు చెప్పిన పై లక్షణమునకు సరిపోవును.

## 73. ముద్రాలంకారము

136. సూచ్యార్థ సూచనం ముద్రా ప్రకృతార్థ పరైః పదైః।
నితంబ గుర్వీ తరుణీ దృగ్యుగ్మ విపులాచ సా॥

గీ. ప్రణుతి కెక్కును బ్రకృతార్థ పర పదాళి
చేత సూచ్యార్థ సూచనచేయ ముద్ర
హరుని కీర్తించు చున్నవాఁ డతఁడు వినుము
సాటిలేనిది సుమ్మీ యీ తేటగీతి. 148

ప్రకృతార్థము నిచ్చు పదములచేత సూచ్యార్థ సూచన చేయబడిన నది ముద్రాలంకారమగును.

'అతడు హరుని కీర్తించుచున్నాడు వినుము యీ తేటగీతి సాటి లేనిది సుమా !' ప్రస్తుతార్థము హరుని కీర్తించుట ఈ గీతి తేటయై మనో హరముగా నున్నది యని చెప్పబడినది సూచ్యార్థము ఈపద్యము 'తేట గీతి.' అని ఈ గీతి తేటయైనదను ప్రకృతార్థమున ఈ పద్యము తేటగీతి యను సూచ్యార్థమును సూచన చేయబడుటచే నిది ముద్రాలంకారము,

## 74. రత్నావళ్యలంకారము

137. క్రమికా ప్రకృతార్థానం న్యాసం రత్నావళిం విదుః।
చతురాస్యః పతి ర్లక్ష్మ్యాః సర్వజ్ఞ స్త్వం మహీపతే॥

క. కృతి రత్నావళి దనరు ప్ర
కృతార్థ సంచయము వరుసఁ గీలు కొలిపినన్
జతు రాననుండు లక్ష్మీ
పతి సర్వజ్ఞుండు నీవ పార్థివ యనగన్ 150

అప్రకృతార్థములను వరుసగ చెప్పిన అది రత్నావళ్యలంకార మగును.

‘ఓ రాజా ! నీవు చతురాననుడవు, లక్ష్మీపతివి, సర్వజ్ఞుడవు.’ ఇచట రాజు ప్రకృతము. బ్రహ్మ, విష్ణు, మహేశ్వరులను వరుస లోక ప్రసిద్ధము. ఈ వరుస అప్రకృతము. ఈ అప్రకృతమైన ప్రసిద్ధ క్రమము ప్రకృతమైన రాజుతో చేరచుండుటచే నిది రత్నావళ్యలంకారమైనది.

బ్రహ్మ విష్ణు మహేశ్వరులను క్రమముతప్పిన అది అప్రసిద్ధమగును. చతురాననుడనుటచే మాటనేర్పరియని, బ్రహ్మయని, లక్ష్మీపతి యనుటచే సంపన్నుడని, విష్ణువని, సర్వజ్ఞుడనుటచే సమస్తముతెలిసినవాడని, శివుడని రెండేసి అర్థములు లభించుచున్నవి. తొలి అర్థములు రాజున కన్వయించును, రెండవ అర్థములును శ్లేషసామర్థ్యమున రాజున కన్వయించును. ఈ అప్రకృతార్థములను వరుసగ చెప్పి ప్రకృతమైన రాజున కన్వయింపచేయుటచే నిది రత్నావళ్యలంకారమైనది.



## 75. తద్గుణాలంకారము

138. తద్గుణ స్వగుణ త్యాగా దన్యదీయ గుణగ్రహః
పద్మరాగాయతే నాసా మౌక్తికం తేఽధరత్విషా॥



క. స్వగుణ త్యాగంబున న
న్యగుణావ్యాప్తి యగునేని నది తద్గుణమౌఁ
దొఁగకంటి నత్తు ముత్తెము
పగడమువలెఁ దోఁచె నధర భాభాసితమై



స్వగుణములను విడచుటచే అన్యగుణములను గ్రహించిన అది తద్గుణాలంకారము.

'పౌలతి నత్తు ముత్తెము అధరభాసితమై పగడమువలె తోచుచున్నది ముత్యము తన స్వగుణమైన తెలుపును కోల్పోయి అధరభాసితమై దాని వర్ణమైన ఎఱుపును పొందుటచే పగడమువలె భాసించుచున్నది. కావున నిది తద్గుణాలంకారమైనది.

## 76. పూర్వరూపాలంకారము

139. పునస్స్వగుణ సంప్రాప్తిః పూర్వరూప ముదా
హృతమ్।
హార కంఠాంశులిప్తోఽపి శేష స్త్వద్య శసా సితః॥

క. తనరారుఁ బూర్వ రూపము
పునరాత్మగుణాప్తియైనఁ బురహర కంఠాం
శు నిలిపుఁడయ్యు నీ యశ
మున శుభ్రశరీరుఁడయ్యె భుజగేంద్రుఁడనన్ 151

స్వగుణమును విడచి మరల తన స్వగుణమును గ్రహించినట్లు వర్ణించిన నది పూర్వరూపాలంకారము.

'పురహరుని కంఠకాంతులచే నల్లనయిన భుజగేంద్రుడు నీ యశః కాంతులకు తెల్లనయ్యెను.' శేషుని అసలురంగు తెలుపు శివుని కంఠకాంతి శేషుని నలుపు చేసినది. రాజు యశఃకాంతులచే శేషుడు పూర్వ వర్ణము నొందెను. కావున నిది పూర్వరూపాలంకారము.

140. పూర్వావస్థానువృత్తిశ్చ వికృతే సతి వస్తుని।
దీపే నిర్వాపితేఽప్యాసీత్కాంచీరత్నైర్మహన్మహః

గీ. వస్తువు వికృతమైన పూర్వదశ జెడక
యమరుటయు పూర్వరూపభేద మగుచుండు
దీప ముపశమితంబైనఁ దేజరిల్లె
మున్నువలె మేఖలారత్నములు వెలుంగు 152

వస్తువు వికృతమైనను పూర్వదశయే జెడకుండ నుండిన నదియు పూర్వరూపాలంకారమగును.

'దీప ముపశమించినను మేఖలారత్నములు మునుపటివలెనే గొప్ప కాంతినిచ్చుచున్నవి. నాయిక అనుకూలవతి యగుటకు చీకటికొరకు దీపము ఆర్పివేయబడినది. కాని మేఖలారత్నముల కాంతివలన పూర్వదశయే చెడకుండ నుండెను. మొదటి కాంతికి దీపము కారణము కాగా, తరువాతి కాంతికి మేఖలారత్నములు కారణములైనవి. కారణములు మారినవికాని కాంతిస్థితియందు మార్పులేదుకాన నిది పూర్వరూపాలంకారమైనది.

## 77. అతద్గుణాలంకారము

141. సంగతాన్యగుణానంగీకార మాహు రతద్గుణమ్।
చిరం రాగిణి మచ్చిత్తే నిహితాపి న రజ్యసి॥

క. జానొందు సంగతాన్యగు
ణానంగీకృతి యతద్గుణాలంకృతినాఁ
జాన ! చిరరాగయుతయును
మానసహితవు నయ్యుండి మనసీవు గదే 153

సంగతమైన అన్యపదార్థగుణమును స్వీకరింపకుండుట అతద్గుణాలంకారమగును.

'ఓ చానా! రాగయుక్తమైన నా మనమున చిరకాలముండియు నీవు రాగమునందవైతివి.'

నాయకుని మనసు రాగయుక్తము కాని నాయిక అనుకూలమగుట లేదు. నాయకుడనుచున్నాడు. నామనసు రాగయుక్తము నీవు నామనసులో నుండుటచే తత్సంసర్గమున నీవును రాగయుక్తవు కావలసియున్నది. కాని నీవట్లుకావైతివి. అని అనుటచే అన్యపదార్థగుణము సంగతమైనను నాయికచే స్వీకరింప బడలేదుగాన నిది అతద్గుణాలంకారమైనది

## 78. అనుగుణాలంకారము

142. ప్రాక్సిద్ధ గుణోత్కర్షోఽనుగుణః పరసన్నిధేః।
నీలోత్పలాని దధతే కటాక్షై రతినీలతామ్॥

గీ. అనుగుణంబగుఁ బూర్వసిద్ధాత్మ గుణము
అన్య సన్నిధివలనఁ బెంపందెనేని
నల్లతొవలు కటాక్షేక్షణములచేత
నధిక నీలిమఁ దాల్చెడు నన్నయట్లు 154

పూర్వసిద్ధాత్మ గుణమునే అన్య సన్నిధివలన మరింత పొందినట్లు వర్ణింపబడిన నది అనుగుణాలంకారమగును.

నల్లకలువలు పడతి క్రీగంటి చూపులచేత మరింత నీలిమనందినవి పడతి కర్ణముల ధరించిన నల్ల కలువలు సహజముగా నల్లనైనవైనను కామిని కడకంటిచూపులచే మరింత నీలిమ నందినట్లు వర్ణింపబడుటచే నిది అనుగుణాలంకారము

## 79. మీలితాలంకారము

143\. మీలితం యది సాదృశ్యా ద్భేద ఏవ న దృశ్యతే।
రసో నాలక్షి లాక్షాయా శ్చరణే సహజారుణే॥

గీ. మీలితంబగు భేదమేమియును సమత
వలనఁ గానంగ బడదేని వామనయన
కానఁబడదించుకేని లాక్షారసంబు
సహజ శోణమ్ములైన నీ చరణములను 155

సాదృశ్యమువలన భేదమేమియు కనబడకున్న నది మీలితాలంకారమగును.

వామనయన! సహజశోణములైన నీ చరణములందు లాక్షారస మించుకేనియు కానబడదు.' లాక్షారసము వర్ణము ఎఱుపు. పాదములు సహజ శోణితములగుటచే లాక్షారసము ఎఱుపు కలిసిపోయి కనబడుటలేదు అనుట నిది మీలితాలంకారమయినది.

## 80. సామాన్యాలంకారము

144\. సామాన్యం యది సాదృశ్యా ద్విశేషో నోపలక్ష్యతే।
పద్మాకరం ప్రవిష్టానాం ముఖం నాలక్షి సుభ్రువామ్॥

గీ. అమరు సామాన్యమన విశేషము సదృశత
కంటెఁ జూపట్టదేని సత్కావ్యములను
దమ్మికొలఁకుల దాఁకొన్న తలిరుఁబోండ్ల
యాననము గుర్తుపట్టరా దనిన కరణి 156

సాదృశ్యమేకాని విశేషము కనబడకున్న అది సామాన్యాలంకార మగును. రెండువస్తువులకును భేద ప్రతీతి యుండినను భేదక ధర్మవివేకము కానరాకున్న నది సామాన్యాలంకారమని భావము.

తమ్మికొలకుల తానమాడు తెలిరుబోండ్ల ఆననము గుర్తుపట్టరాని దయ్యేను.' ముఖ, పద్మములకు భేదమున్నను సాదృశ్యమే కనబడుచున్నది ఇది ముఖము, ఇది పద్మము అని చెప్పవీలుకాకున్నది. కావున నిది సామాన్యాలంకారము.

మీలితాలంకారమున వస్తువులువేరు గుణములు ఒక్కటే సామాన్యము వస్తువులువేరు, వాటి గుణములును వేరగుచున్నవి

## 81. ఉన్మీలితాలంకారము

## 82. విశేషకాలంకారము

145. భేదవైశేష్యయోః స్ఫూర్తా వున్మీలిత విశేషకా।
హిమాద్రిం త్వద్యశోమగ్నం సురాశ్శితేన జానతే
లక్షితా న్యుదితే చంద్రే పద్మానిచ ముఖానిచ॥

గీ. భేద విస్ఫురణంబు గల్పించుచుండఁ
దనరుఁ గృతులందు నున్మీలితం బనంగ
నీ యశోలగ్నమైన దానిఁగ హిమాద్రి
నమరు లెఱిఁగెద రివముచే ననువిధమున 157

భేదవిస్ఫురణము కల్పింపబడిన నది ఉన్మీలితాలంకారమగును ఇది మీలితాలంకారమునకు వ్యతిరేకము.

'నీ కీర్తియందు మునిగిన హిమాద్రిని అమరులు శీతలత్వముచే గుర్తింతురు.' రాజుకీర్తి లోకమంతయు వ్యాపించినది. అందు హిమాద్రి మునిగినది. రెండును తెల్లనివగుటచే హిమాద్రిని గుర్తించుట కష్టము. ఆ రెంటికిని గల భేదము హిమాద్రికిగల శీతలత్వము. అది రాజుకీర్తికి లేక పోవుటచే హిమాద్రిని అమరులు గుర్తింప గలుగుచున్నారు. ఈ భేదము చెప్పబడినది గాన ఇది ఉన్మీలితాలంకారమయినది

క. అలరు విశేషక మనియెడు
నలంక్రియ విశిష్టభావ మలరుచు నుండన్
నెలపొడమఁ దెలియఁ బడియెడు
జలజంబులు నెమ్మొగములు జనుల కనుక్రియన్ 158

విశిష్టభావ మలరుచుండిన నది విశేషకాలంకారము. ఇది సామాన్యాలంకారమునకు వ్యతిరేకము. అట భేదక ధర్మము కన్పట్టదు. ఇట ఒకానొక కారణమున భేదకధర్మము కనబడి రెండు వస్తువులను వేఱువేఱుగ గుర్తించుటకు వీలగును. అదియే విశేషకాలంకారము.

'చంద్రుడుదయింప జనులకు జలజములు, నెమ్మొగములు దెలియబడును.' చంద్రోదయమున కమలములు ముకుళించును. ముఖము లట్లుకావు. చంద్రోదయ కారణమున కన్పట్టు విశేషము ఇందుండుటచే నిది విశేషకాలంకారము అగుచున్నది

## 83. ఉత్తరాలంకారము

146. కించి దాకూత మహితం స్యాద్గూఢోత్తరముత్తరమ్
యత్రాసౌ వేతసః పాంథ తత్రేయం సుతరా సరిత్॥

గీ. గూఢమగు నుత్తరంబు సాకూతమైన
నా యలంకార ముత్తరం బనఁగఁ బరగు
పాంథ ! యా ప్రబ్బపొదయున్న పట్టునందు
నీ తరంగిణి దాఁటుట యెల్లిద మన 159

ఉత్తరాలంకారము రెండుభేదములు 1, గూఢోత్తరము, 2, చిత్రోత్తరము.

అభిప్రాయ గర్భితమైన జవాబు ప్రకటింపబడిన నది గూఢోత్తరాలంకారమగును.

'బాటసారీ ! ఆ ప్రబ్బపొదయున్నచోట ఈ తరంగిణిని దాటుట సుకరము. ఈ ప్రవాహము దాటుటయెటు ? అనునది ఒక యువకునిసమస్య దానికి బదులుపలుకుచు ఒక యువతి తన వాంఛను అందించి పలుకుచున్నది. ఆ ప్రబ్బపొదచెంత ఈప్రవాహము దాటుటకు వీలుగానుండునని బాహ్యార్థము. ఆ ప్రబ్బపొద గుబురుగా నుండుటచే మన ఏకాంతమునకు అనుకూలమయినదను భావము గూఢముగా నందుండుటచే నిది గూఢోత్తరాలంకారమయినది.

147. ప్రశ్నోత్తరాన్తరాభిన్నముత్తరం చిత్రముత్తరం।
కేదార పోషణరతాః కేఖేటాః కిం చలం వయః॥

క. పరఁగుఁ గృతులందు ప్రశ్నో
త్తర మనఁగ నలంక్రియా వతంసము ప్రశ్నో
త్తరము లొకటయిన నద్దీ
శ్వర వాహనమనఁగ సరస సమ్మత మగుచున్ 160

గీ. కృషికు లెద్దాని వాంఛింతు రెల్లయప్డు?
వక్క నెద్దాన నొక్కంగ వలయు చెపుమ?
పంటనని యుత్తరము చెప్పవాడ! సఖుడ!
రెండిటికి నది యొక్కటే లెక్కగాను 161

ఏది ప్రశ్నయో అదియే జవాబుగా తెలుపబడినను, రెండు ప్రశ్నలకు ఒక్కటే జవాబుచెప్పబడినను అది చిత్రోత్తరాలంకారమగును.

1. ఎద్దీశ్వర వాహనము? (ఈశ్వరుని వాహనమేది?)
ఎద్దు ఈశ్వర వాహనము (ప్రశ్నయే జవాబు)

2. రైతులెల్లప్పుడు దేనిని కోరుదురు?
వక్కను దేనితో నొక్కవలయును?
పంటను, (పైరెండు ప్రశ్నలకు ఒక్కటే జవాబు)
కావున ఇది చిత్రోత్తరాలంకార మయినది.

సంస్కృతమున కే దార పోషణ రతాః? (భార్యను పోషించుటయందాసక్తి గలవారెవ్వరు?) అని ప్రశ్న.

కేదార పోషణ రతాః! (పంటలను రక్షించుటయందాసక్తిగలవారు) అని ప్రశ్నయే సమాధానము.

రెండవది కే ఖేటాః? (ఆకాశమందు సంచరించునవేవి?)
కిం చలం? (చలించేదేది?) అవి రెండు ప్రశ్నలు.
వయః (1 పక్షులు, 2 వయస్సు,) ఒక్కటే జవాబు.
అనువాదమున క్రొత్తయుదాహరణము తీయబడినవి.

## 84. సూక్ష్మాలంకారము

148. సూక్ష్మం పరాశయాభిజ్ఞేతర సాకూత చేష్టితమ్।
మయిపశ్యతి సాకేశైః స్సీమన్తమణి మావృణోత్॥

గీ ఒరుల యాశయ మెఱిఁగిన యొరులుసేయు
సరస సాకూతచేష్ట సూక్ష్మమనఁ బరఁగు
నేను చూచుచునుండ నా యింతి తనదు
కచములను మౌళిరత్నంబు గప్పె ననఁగ 162

ఇతరుని యొక్క అభిప్రాయమును గ్రహించి దానికి బదులుగా అభిప్రాయగర్భితముగా చేయబడిన చేష్ట సూక్ష్మాలంకారమగును

'నేను చూచుచుండగా ఆ యింతి తన మౌళిరత్నమును కచములతో కప్పినది.' ఇది సంకేతము తన రాకనుకోరు ప్రియునికి సూర్యాస్తమయము తరువాత అని ప్రియురాలు సంకేతమిచ్చినది. మౌళిరత్నము సూర్యుడు. కచములు కప్పుట చీకటులువ్యాపించుట యను ఈ యభిప్రాయచేష్టవలన నిది సూక్ష్మాలంకారమయినది.

## 85. పిహితాలంకారము

149. పిహితం పరవృత్తాన్త జ్ఞాతు స్సాకూత చేష్టితమ్।
ప్రియే గృహాగతే ప్రాతః కాన్తా తల్ప మకల్పయత్॥

గీ. ఇతర గూఢప్రవృత్తి దానెఱిఁగి నట్టు
దెలుపు చేష్ట పిహితమన దెలియఁబడును
దయితుఁడు గృహంబునకుఁ బ్రభాతమున రాఁగఁ
దల్పకల్పన యొనరించె దరుణి యనఁగ 163

ఇతరుని రహస్య వృత్తాంతము తనకు తెలియునని చేయబడిన సాభిప్రాయచేష్ట పిహితాలంకారమగును. సూక్ష్మాలంకారమున పరభావమునకు సాభిప్రాయ చేష్టితముగ జవాబీయబడును. అది భావ్యర్థబోధకము. పిహితాలంకారమున సాభిప్రాయ చేష్టితమున పరుని భావము ప్రకాశము చేయబడును ఇది భూతార్థ బోధకము.

ప్రభాతమున పతి యింటికిరాగా పడతి ప్రక్కసద్దెను.

భర్త రాత్రి వేఱొక వనితతో గడపివచ్చినట్లు తెలుసుకొన్నదగుటచే మాఱుమాటాడక ఆతడు నిద్రించుటకు ప్రక్క సర్దినది. నోటితోనేమియు ననక చేష్టారూపముననే సూచింప బడుటచే యిది పిహితాలంకారమయినది

## 86. వ్యాజోక్త్యలంకారము

150. వ్యాజోక్తి రన్యహేతూక్త్యా యదాకారస్య గోపనమ్।

సఖి ! పశ్య గృహారామ పరాగై రస్మి ధూసరా॥

గీ. ఆత్మకృత చిహ్నగోపనం బమరఁ గార
ణాంతరము చెప్ప వ్యాజోక్తి యనఁగ నమరు
గంటివే యిప్పుడే చెలి ! యింటిదోఁట
లోని కెంధూళి పడియె నామేన ననఁగ 164

ఆత్మకృతమయిన చిహ్నమును మఱుగుపరచుటకు కారణాంతరమును తెల్పిన అది వ్యాజోక్త్యలంకారమగును.

'సఖీ! ఇంటితోటలోని పుప్పొడి మేనినిండపడి ధూసరితనైతిని. ప్రియుని సంగమమున ధూసరితమయిన మేను పుప్పొడి చేతనని మఱుగుపరచి చెప్పబడుచుండుటచే నిది వ్యాజోక్త్యలంకారము.

## 87. గూఢోక్త్యలంకారము

15¹. గూఢోక్తి రన్యోద్దేశ్యా గీ ర్యదన్యం ప్రతి కథ్యతే,
వృషా పేహి పరక్షేత్రా దాయాతి క్షేత్రపాలకః॥

గీ. ఒకని యుద్దేశమునను వేఱొకనికి-దాని
నుగ్గడించుట దనరు గూఢోక్తి యనఁగ
నొరుని చేనున నీవు మేయుట పొసఁగునె
వృషభమా! దాని కర్షకుం డేఁగుదెంచు 165

ఒకరి నుద్దేశించి చెప్పదలచినదానిని వారికి తెలియునట్లు, ఇతరులకు తెలియకుండునట్లు వేరొకరిని సంబోధించి గూఢముగా చెప్పబడిన అది గూఢోక్త్యలంకారమగును.

'వృషభమా! పరక్షేత్రమునుండి పొమ్ము. క్షేత్రపాలకు డేగుదెంచుచున్నాడు.

పరస్త్రీసంగమము నందున్న నాయకుని గూఢముగా హెచ్చరించుచు చెప్పబడిన వాక్యమిది. ఆమెభర్త వచ్చుచున్నాడని గట్టిగచెప్పరాదుగాన గూఢముగా వృషభమును సంబోధించి చెప్పబడినదిగాన నిది గూఢోక్త్యలంకారమయినది.

## 88 వివృతోక్త్యలంకారము

152. వివృతోక్తి శ్లిష్టగుప్తం కవినావిష్కృతం యది।
వృషాపేహి పరక్షేత్రా దితి వక్తి ససూచనమ్॥

గీ. శ్లిష్టగుప్తము కవి వివేచించి దెలుప
నదియ వివృతోక్తి యనుపేర నమరుఁ గృతుల
వృషభమా! పరక్షేత్రంబు విడిచి తొలఁగు
మని ససూచనముగఁ జెప్పె నన్నయట్లు 166

గూఢోక్తిలోని గూఢతను కవి సూచనతో బయల్పరచేవి అది వివృతోక్త్యలంకారము.

'వృషభమా! పరక్షేత్రమునుండి తొలగిపొమ్ము. అని ససూచనముగా చెప్పెను.' ఇవి కవి మాటలు. ససూచనముగా నని టచే ఇది వృషభమును గూర్చిగాదని తెలియుచుండుటచే నిది వివృతోక్త్యలంకారమయినది.

## 89. యుక్త్యలంకారము

153. యుక్తిః పరాతి సంధానం క్రియయా మర్మగుప్తయే।
త్వా మా లిఖన్తీ దృష్ట్వాన్యాం ధనుః పౌష్పం కరే
లిఖేత్॥

గీ. పరుని వంచించి మర్మగోపనము క్రియను
జేయునది యుక్తియని వివక్షింపఁబడియె
యింతి నీ రూపు వ్రాయుచు నితరుని గని
చేతఁ బూవిల్లు లిఖియించె శీఘ్రమె యన 167

మర్మగోపనమునకై ఉపాయమున పరుని వంచించుట యుక్త్యలంకారము. ఆ ఉపాయము మాటలతోనైన అది ఛేకాపహ్నుత్యలంకారము. చేతలలోనైన యుక్త్యలంకారము అగును.

'ఇంతి నీరూపు వ్రాయుచు పరుఁగని చేత పూవింటిని లిఖించెను.' ఇది దూతిక వాక్యము. నాయిక నిన్ను చూడగోరి నీరూపమును లిఖించినది ఇంతలో పరులు వచ్చుటగని రహస్యము బయల్పడునని చేతిలో పుష్ప ధనుస్సును లిఖించినది. రహస్యగోపనమైనది. ఆస్త్రీ అదినాయకునిరూపము కాదు, మన్మధుని రూపమని భ్రమించుటచే ఉపాయమున వంచింపబడినది గాన ఇది యుక్త్యలంకారమైనది.

## 90. లోకోక్త్యలంకారము

154. లోకప్రవాదా నుకృతిర్లోకోక్తి రితి కథ్యతే।
సహస్వ కతిచిన్మాసా న్మీలయిత్వా విలోచనే॥

క. తనరును లోకోక్తి యనన్
జనులాడెడు నుడువులట్లు సత్కృతులం జె
ప్పిన యేనియుఁ గొన్ని నెల
లకనుగవ మూసికొనియుండు కలికి యనంగన్ 168

ప్రజలందు ప్రచారములోనున్న మాటలను కృతులందుచెప్పిన అది లోకోక్త్యలంకారము.

'కాంతా ! కొన్ని నెలలు కనులు మూసికొనియుండుము. కనులు మూసికొని యుండుట లోకోక్తి. విదేశగతుడయిన నాయకునికై విరహాతుర యయిన నాయికకు ఇట్లు చెప్పబడినది. ఇంక కొన్నినెలలు ఓపిక పట్టుము.

కాంతుడు వచ్చును. అని అంతియకాని కళ్ళుమూసికొని ఉండుమని కాదు ఇట్లు లోకోక్తి చెప్పబడుటచే నిది లోకోక్త్యలంకారము.

## 91. ఛేకోక్త్యలంకారము

155. ఛేకోక్తి ర్యత్ర లోకోక్తి స్స్యాదర్థాన్తర గర్భితా।
భుజంగ ఏవ జానీతే భుజంగ చరణం సఖే॥

గీ. కథితలోకోక్తి యన్యార్థ గర్భితమయి
కృతుల ఛేకోక్తియనఁగ సమ్మతికి నెక్కు
బన్నగము పాదములజాడఁ బన్నగంబ
యెఱిఁగెడి నఁగ లక్ష్య మహీనభూవ 169

అన్యార్థ గర్భితమయిన లోకోక్తి చెప్పబడిన అది ఛేకోక్త్యలంకారమగును.

'పన్నగముల పాదముల జాడ పన్నగమే యెఱుగును.' అ అహేః పాదా నహిరేవవేత్తి' అను సంస్కృతలోకోక్తి కలదు. దాని కనువాదమిది- ఒకడు వేరొకనివృత్తాంతము నడుగ అతడు తనకుతెలియదని అవిఇంకొకనికి మాత్రమే తెలియునని చెప్పెను. అనగా ఆఒకని వృత్తాంతము ఆఇంకొకనికి కాని వేరెవ్వరికిని తెలియదని చెప్పెను. ప్రతిపనిలో వారిరువురు కలిసి వర్తింతురు గాన వారి వృత్తాంతము వారికే తెలియునని పైలోకోక్తిభావము. ఇటులుగ విహరించుట యందును వారు కలిసి వర్తింతురను గర్భితమయిన విషయము వెల్లడియగుచుండుటచే నిది ఛేకోక్త్యలంకారమయినది.

## 92. వక్రోక్త్యలంకారము

156. వక్రోక్తిః శ్లేష కాకుభ్యా మపరార్థ ప్రకల్పనమ్।
ముంచమానం దినం ప్రాప్తం నేహ నందీ హరాన్తికే॥

గీ అవును వక్రోక్తి శ్లేష కాకువులచేత
నమర నపరార్థ కల్పనం బయ్యెనేని
సూరకవి వేలుపెవ్వడు ? సోముఁడు త్ప
లావు్డా ? కాదు గౌరీసహాయుఁ డనఁగ 170

శ్లేష చేతగాని, కాకువుల చేతగాని పదార్థము కల్పింపబడిన అది వక్రోక్త్యలంకారము.

'సూరకవి వేలుపెవడు ? సోముడు. చంద్రుడా ? కాదు శివుడు.' మొదటిప్రశ్నకు సమాధానముగా శివుడు అను అర్థమున 'సోముడు' అని చెప్పబడినది. కాని, చంద్రుడు అను అర్థాంతరమును గ్రహించి మరల ఉత్ప లావ్తుడా ? అని ప్రశ్నింపబడినది. కాదు గౌరిసహాయుడు శివుడేయని సందేహనివృత్తి కావింపబడినది. శ్లేషసహాయమున వక్రోక్తి సాధింపబడుటచే నిది వక్రోక్త్యలంకారము.

'కోప మువితము కాదన్న ప్రియునికాంత అవును ఉచిత కాముదు అనుచు నృప్పమాలతో కొట్టెను. కోప మువితము కాదని అంగీకరించిన నాయికి కొట్టుట ఎందులకు? కనుక ఉచితమే అను అర్థాంతరము గ్రహింప బడుచున్నది. కావున ఇది కాకువు నాశ్రయించిన వక్రోక్తి.

శ్లేషాశ్రితమయిన వక్రోక్తి శాస్త్ర సిద్ధము. కాకువు నాశ్రయించిన వక్రోక్తి ఐచ్ఛికము, ఇది సన్నివేశమునుబట్టి, అవయవ విన్యాసమునుబట్టి తత్కాలక్రియ సాహచర్యమునుబట్టి గ్రహింపబడుచుండును.

## 93. స్వభావోక్త్యలంకారము

157. స్వభావోక్తి స్స్వభావస్య జాత్యాదిస్థ స్య వర్ణనమ్ ।
కురంగై రుత్తరంగాక్షై స్స్తబ్ధ కర్ణై రుదీక్షితమ్ ॥

గీ. అగు స్వభావోక్తి జాత్యాదులందుఁగల స్వ
భావ మెంతేని వర్ణింపఁబడియె నేని
హారిణములు చూచె నుత్తరంగాక్షములును
స్తబ్ధకర్ణము లగుచు నస్పందమునను　　171

జాతి, గుణము మొదలగు వాని స్వభావము వర్ణింపబడిన అది స్వభావోక్త్యలంకారము.

'మిక్కిలి చంచలములైన కన్నులును, నిశ్చలములైన చెవులును కలిగి హరిణములు చూచెను. అనుచో హరిణముల స్థితి స్వాభావికముగా వర్ణింపబడుటచే నిది స్వభావోక్త్యలంకారమయినది.

## 94. భావికాలంకారము

158. భావికం భూత భావ్యర్థ సాక్షాత్కారస్య వర్ణనమ్।
అహం విలోకయేఽద్యాపి యుధ్యన్తేఽత్ర
సురాసురాః॥

గీ. అలరు భావిక మనఁగ గతాగతార్థ
ములు పదంపడి ప్రత్యక్షముగ వచింప
నిప్పటికి నేను జూచెద నిచట దివిజ
దనుజు లని యొనరించెద రనిన మాడ్కి　　172

భూత, భవిష్యత్తులు వర్తమానములో జరుగుచున్నట్లు వర్ణింపబడిన అది భావికాలంకారము.

దేవదానవులదిగో యుద్ధము చేయుచున్నారు. నేనిదే చూచుచున్నాను దేవదానవుల యుద్ధము భూతకాలమునాటిది. దానిని ప్రస్తుతము జరుగుచున్నట్లు చెప్పబడినదగాన ఇది భావికాలంకారము.

అట్లే భవిష్యత్కాలమునాటి విషయమును వర్తమానమున జరుగుచున్నట్లు తెలిసినను అది భావికాలంకారమగును.

## 95. ఉదాత్తాలంకారము

159. ఉదాత్త మృద్ధిశ్చరితం శ్లాఘ్యం వాన్యోపలక్షణమ్।
సానౌ యత్రాభవద్యుద్ధం తద్ధూర్జటి కిరీటినోః॥

గీ. శ్లాఘనీయంబు నన్యోప లక్షణంబు
నైన చరితం బుదాత్తమై యతిశయిల్లు
నా హర కిరీటులకు యుద్ధమయ్యె నెచట
నదియ యిది యను చందాన నహిపవిభూష 173

సమృద్ధిని వర్ణించినను, అన్యోపలక్షణమైన మహాపురుష శ్లాఘ్యచరితమును వర్ణించినను అది ఉదాత్తాలంకారము.

సమృద్ధికి లక్ష్యము 'రత్న స్తంభములందు కనబడుచున్న రావణుని హనుమంతుడు కష్టముమీద తెలిసికొనెను.'

రత్నస్తంభ సమృద్ధి రావణుని యైశ్వర్య సమృద్ధిని తెలుపుచున్నది. కాన ఇది ఉదాత్తాలంకారమైనది అన్యోపలక్షణమైన శ్లాఘ్య పురుషచరితమునకు లక్ష్యము.

'ఏ పర్వతమున హర కిరీటులకు యుద్ధమయ్యెనో, అది యిది' అనుచో వర్ణ్యము హిమాచలము హరకిరీటుల చరిత్రము అంగము. ఈ వర్ణనము వర్ణ్యమునకు ఉత్కర్షను కలిగించుచున్నది.

## 96 అత్యుక్త్యలంకారము

161. అత్యుక్తి రద్భుతాతథ్య శౌర్యౌదార్యాది వర్ణనమ్।
త్వయి దాతరి రాజేంద్ర। యాచకాః కల్పశాఖినః॥

గీ. తనరు నత్యుక్తి యద్భుతాతథ్య శౌర్య
వితరణాదిక వర్ణనాన్వీత మగుచు;
దాత నీవగుచుండఁగ ధరణినాథ!
యాచకులు కల్పశాఖు లన్నట్లు కృతుల 174

అద్భుతమును, మిథ్యారూపమైన శౌర్య వితరణాదికమును వర్ణింపబడిన అది అత్యుక్త్యలంకారము'

'ఓ రాజా! నీవు దాతవగుచుండ, కల్పవృక్ష శాఖలు యాచకులగుచున్నవి.' రాజు దానము చేయుచుండ, కోరికలనుతీర్చెడి కల్పవృక్షమే రాజును యాచింపవలసి వచ్చినది. ఇది అద్భుతము, మిథ్యారూపమునైన వితరణ వర్ణనము. కల్పవృక్షశాఖలు రాజుచేత యాచకులగుట సత్యము కాదు కావున ఇది అత్యుక్త్యలంకారమైనది.

## 97 నిరుక్త్యలంకారము

162. నిరుక్తిర్యోగతో నామ్నా మన్యార్థత్వ ప్రకల్పనమ్।
ఈదృశై శ్చరితై ర్జానే సత్యం దోషాకరో భవాన్॥

గీ. అధిక యోగము వలన నన్వార్థఘటన
నామముల కైనను నిరుక్తి నా నెసంగు
నీదృశ్య చరిత్రములచేత నే నెఱిఁగెద
నీవు దోషాకరుండవు నిజమనంగ 175

శబ్ద యోగమువలన నామములకు అన్వార్థము కల్పింపబడిన అది నిరుక్త్యలంకారము. శబ్దయోగమన వ్యుత్పత్తి.

'ఓ చంద్రుడా! ఈ దృశ చరిత్రములచేత నేనెఱుంగు చున్నాను. నిజముగ నీవు దోషాకరుడవు.'

దోషాకరుడనగా 'దోషాకరోతీతి దోషాకరః' రాత్రిని చేయువాడని అర్థము. కాని వ్యుత్పత్తినిబట్టి దోషములకు నిలయుడని అన్వార్థము కల్పింపబడుచున్నది. విరహిణులను బాధించుచుండుటనే చంద్రుడు దోషాకరుడని వ్యుత్పత్తినిబట్టి చెప్పబడుచున్నది గాన ఇది నిరుక్త్యలంకారమైనది.

## 98 ప్రతిషేధాలంకారము

163. ప్రతిషేధః ప్రసిద్ధస్య నిషేధస్యానువర్ణనమ్।
న ద్యూత మేతత్కితవ। క్రీడనం నిశితైః శరైః॥

గీ. శ్రుతిఁ బ్రసిద్ధ నిషేధానుకీర్తనంబు
పనుపడినయేనిఁ బ్రతిషేధమనఁగఁ బరఁగు
గితవ! యతిశిత సాయక క్రీడనంబు
గాని కాదిది జూదమ సక్ధరణి శర్వ 176

ప్రసిద్ధమైన నిషేధము కృతులలో మరల చెప్పబడిన అది ప్రషేధాలంకారము.

'ఓ జూదరీ ! ఇది జూదము కాదు. వాడి బాణములతో నాడు క్రీడ. జూదరికి జూదమునందే కాని యుద్ధమునందు కౌశల్యముండదను భావమున ఇది చెప్పబడినది. జూదము యుద్ధము కాదను నిషేధము ప్రసిద్ధము మరల చెప్పపనిలేదు అయినను స్పష్టముగా నిషేధింపబడుటచే నిది ప్రతిషేధాలంకారమైనది.

## 99 విధ్యలంకారము

164. సిద్ధస్యైవ విధానం యత్తామాహు ర్విధ్యలం
కృతిమ్।
పంచమోదంచనే కాలే కోకిలః కోకిలో
భవేత్ ॥

గీ. సిద్ధమగు నర్థమును వెండిఁజెప్పి రేని
విధ్యలంకృతి యనఁగను వినుతిఁ గాంచుఁ
బంచమం బెత్తుగడ చేయఁబడియె నేనిఁ
గోకిలం బప్పు డప్పుఁగదా కోకిలంబు 178

సిద్ధమైన యర్థమును మరలచెప్పిన అది విధ్యలంకారమైనది. దీని వలన అర్థాంతర స్ఫూర్తి కలిగి శోభావముహగ నుండును.

'పంచమ స్వరము నెత్తుకొన్నచో అపుడు కోకిల కోకిలయే యగును

కోకిలను కోకిలయనుట సిద్ధవిషయము దానిని మరల చెప్పపనిలేదు కాని పంచమ స్వరము నెత్తుకొనుటవలన కోకిల యగుచున్న దనుటచే వసంతకాల విశేషము పునర్విధానము శోభావహ మగుచున్నది కావున ఇది విధ్యలంకారమైనది.

## 100. హేత్వలంకారము

165. హేతో ర్హేతుమతా సార్ధం వర్ణనం హేతు
రుచ్యతే।
అసావుదేతి శీతాంశు ర్మానభేదాయ సుభ్రువామ్॥

గీ. కార్య కారణములు రెండు గలియఁ బలికె
నేని యది హేత్వలంకృతి నా నెసంగు
నుదయ మందెడు నీ శశి మదవతీ క
దంబమానము ల్విచ్చ చెద్యుంబు కొఱకు

కార్య కారణములు రెండును కలిపి ఒకే వాక్యమున వర్ణింపబడిన ఇది హేత్వలంకారము.

హేతువు కారణము, హేతుమంతము కార్యము.

'మదనవతుల మానచ్ఛేదనమునకై చంద్రు డుదయించుచున్నాడు. అనుచో చంద్రోదయము కారణము, మదవతులు అలుక వీడి ప్రియులకు లొంగుట కార్యము. ఈ రెండును ఒకే వాక్యమున చెప్పబడినవి. కావున హేత్వలంకారమయినది. చంద్రోదయము వలన పలువురకు పలు ఫలితము లుండవచ్చును. ఇచట ఫలాంతరము నిషేధింపబడుట సన్నివేశమునకు మఱింత సొగసు కలిగి సహృదయ హృదయరంజక మగును.

166. హేతు హేతుమతోరైక్యం హేతుం కేచిత్ప్ర
చక్షతే ।
లక్ష్మీవిలాసా విదుషాం కటాక్షా వేంకట ప్రభోః॥

గీ. కార్య కారణములకు నైక్యమగు నేనిఁ
గృతులఁ గొందఱు హేత్వలంకృతియ యండ్రు
సత్కవులకున్ రమా విలాసములు వేంక
టేశ్వర కటాక్షము లనంగ నిందువదన ! 179

కార్య కారణములకు ఐక్యము చెప్పినను అది హేత్వలంకారము.

'వేంకటేశ్వర కటాక్షములు, సత్కవులకు లక్ష్మీ విలాసములు' అనుచో కటాక్షములు కారణము, తత్ఫలము లక్ష్మీ విలాసములు కార్యము. కటాక్షములే లక్ష్మీ విలాసములని అభేదము చెప్పబడుటచే నిది హేత్వలంకారమయినది.

క. ప్రాచీనుల మతములు న
ర్వాచీనుల మతములు గని గ్రంథముగా నా
లోచించి శతాలంకృతి
వాచకముగఁ జేయఁబడియె భర్గుని కరుణన్ 180

## గద్యము

ఇది శ్రీమదశేష మనీషి హృదయంగమ మృదుపద రసీంద్ర
శుద్ధాంధ్ర రామాయణ ఘటనా వైదుషీ దురంధర
ఆడిదము బాలభాస్కరకవి తనూభవ సరస
కవిత్వ వైభవ సౌజన్య నిధాన సూర
యాభిధాన ప్రణీతంబైనచంద్రా
లోకంబునందు సర్వంబు
నేకాశ్వాసము.



శ్రీరామకృష్ణ ప్రింటర్స్. రాజమండ్రి 1

## -: మా ప్రచురణలు :-

| | |
|---|---|
| సంపూర్ణ నీతి చంద్రిక | పరవస్తు చిన్నయ సూరి. అండ్ |
| 1/8 డెమ్మీ (300 పేజీలు) | కందుకూరి వీరేశలింగం. |
| నీతి కథామంజరి | కందుకూరి వీరేశలింగం. |
| సత్యరాజా పూర్వదేశ యాత్రలు | ,, |
| సంగ్రహ వ్యాకరణము | ,, |
| రాధాకృష్ణ (శృంగార హాస్యనాటకం) | కవిశేఖర పానుగంటి లక్ష్మీనరసింహారావు. |
| కోకిల | ,, ,, |
| విప్రనారాయణ | ,, ,, |
| కంఠాభరణం | ,, ,, |
| అష్టలక్ష్మీ ప్రసన్నం | శాంతిశ్రీ బొత్సకవి. |
| పోతన భాగవత రత్నాలు | ,, |
| ఆయుర్వేద చికిత్సా విధానం | చక్రవర్తుల పద్మనాభశాస్త్రి. |
| నల దమయంతుల కథ | జయంతి సుబ్రహ్మణ్య శాస్త్రి. |
| నీతి శతక రత్నావళి | ఏనుగు లక్ష్మణ కవి. |
| చంద్రాలోకము | డా. బులుసు వెంకట సత్యనారాయణ మూర్తి. |
| వివేక సింధువు | బొమ్మకంటి వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి. |
| కావ్యస్తబకము | అల్లంరాజు జగ్గారావు. |
| సంగీత విద్యాబోధిని | ఆకొండి శ్రీనివాస రాజారావు. |
| ఆంధ్ర నామ సంగ్రహం | పైడిపాటి లక్ష్మణ కవి. |
| భక్తచింతామణి | కవిశేఖర, వడ్డాది సుబ్బారాయుడు. |
| నక్షత్ర చింతామణి | బొమ్మకంటి వెంకట సుబ్రహ్మణ్య శాస్త్రి |
| ఇంగ్లీషు గ్రామర్ | పప్పు భాస్కర రావు. |
| హిందీ వ్యాకరణం | పురాణపండ శ్రీ చిత్ర. |

ఫోన్ : 73444.

**రోహిణి పబ్లికేషన్స్**

మెయిన్ రోడ్, రాజమండ్రి - 1